# శ్రీమత్ పెద్ద అహోబిళ ఆర్యవైశ్య అన్నసత్ర సంఘం

రిజిష్టర్డు నెం. 195/88

**2-2-21, షావుకారుపేట, ఆళ్ళగడ్డ - 518 543 (కర్నూలు జిల్లా)**

సంప్రదించ వలసిన అడ్రసు :

**6-3-609/161, ఆనంద నగర్, ఖైరతాబాద్**

**హైద్రాబాదు - 500 004.** ఫోన్ నెంబర్లు : 33795 , 224320

## నిత్యాన్నదాన పథకము

దక్షిణదేశ మందలి పవిత్ర పుణ్యక్షేత్రాలలో కర్నూలు జిల్లాలోని అహోబిళ క్షేత్రము ఒకటి దిగువ అహోబిళము, ఎగువ అహోబిళము అని ఈ క్షేత్రము రెండు పుణ్యక్షేత్రాలుగా ఉండి, వరద, అభయ ముద్రలతో శ్రీ నరసింహస్వామి అర్ధాంగి శ్రీ లక్ష్మీదేవి సమేతంగా ఇక్కడ కొలువుదీరి భక్తులను అనుగ్రహిస్తున్నారు. ఉత్తర, దక్షిణ భారత రాష్ట్రాలనుండి భక్తులు ఈ క్షేత్రానికి విశేషంగా వచ్చి స్వామి వారి దివ్యమంగళ విగ్రహాన్ని సందర్శిస్తుంటారు.

ఈ స్వామి వారిని తిలకించుటకు అరుదెంచే వైశ్య యాత్రికులకు వసతి సౌకర్యాన్ని కలిగించుటకు గాను పెద్ద అహోబిళంలో నాలుగు అంతస్థుల భవనాన్ని మూడు సంవత్సరాల క్రితం నిర్మించినాము.

19-5-1989 నుండి నిత్యాన్నదానం చేస్తున్నాము.

అన్నదాన పథకానికి రూ.1175/-లు విరాళంగా ఇచ్చినవారు శాశ్వత సభ్యులుగా ఉంటారు. ఆ మొత్తముపై వచ్చు వడ్డీతో, ఆ దాత పేరున సంవత్సరానికి ఒక్కరోజు శాశ్వతంగా వైశ్య యాత్రికులకు భోజనం పెట్టడం జరుగుతుంది.

ఈ అన్నసత్రభవనాన్ని విస్తరిస్తున్నాం. అందుకు దాతల నుండి విరాళాలు స్వీకరిస్తున్నాం. ఈ భవన నిర్మాణానికి గాను రు.2500/-లు లేక అంతకు పై బడి విరాళంగా ఇచ్చిన దాతల ఫోటోలు ఈ అన్నసత్ర భవనము లోపల ఉంచబడతాయి.

ఈ సత్రం భవన నిర్మాణానికి కానీ, నిత్యాన్నదాన పథకానికి కానీ విరాళం ఇవ్వదలచిన దాతలు నేరుగా పై పేర క్రాస్ చేసిన చెక్కు ద్వారా కానీ, క్రాస్ చేసిన డి.డి. ద్వారా కానీ పై సంప్రదించవలసిన అడ్రసుకు పంపి రసీదు పొందవలెను.

ఉదార హృదయముతో సహకరించ వలసిందిగా వైశ్య మహనీయులను కోరుచున్నాము.

**నిచ్చెనమెట్ల సుబ్బరాయుడు శ్రేష్ఠి** — అధ్యక్షులు

**మేడా నరసింహులు శ్రేష్ఠి** — ప్రధాన కార్యదర్శి

V.P.- A5

తైల ప్రపంచములో మణి దీపాలు

# MR
బ్రాండ్

డబుల్ రీఫైండ్
గ్రౌండ్‌నట్ ఆయిల్
డబుల్ రీఫైండ్
సన్‌ఫ్లవర్ ఆయిల్
మరియు
డబుల్ ఫిల్టర్
గ్రౌండ్‌నట్ ఆయిల్

MR

BRAND




“ ఆరోగ్య
సంరక్షణలో
ఇప్పటికీ వీటిదే
పై చేయి ”

1, 5, 15 కే.జి.ల
ఆకర్షణీయమైన
ప్యాకింగులలో
లభించుచున్నవి.

గుర్తుంచుకోండి
ఎం.ఆర్. బ్రాండ్
వంటనూనెలు అతి
ప్రశస్తమైనవి – అతి
స్వచ్ఛమైనవి.

**MADHU REFINARY PRIVATE LIMITED**
**GOOTY (RS) - 515 402. ANANTAPUR Dt.**

Phones : 42729. 42730 42731 Resi · 42732 Fax · 42730 STD : 08552.

**MADHU SOLVENT EXTRACTIONS (PVT.) LTD.,**
Station Road, GOOTY R.S. - 515 402. Anantapur Dt.

Manufacturers of : DEOILD CAKES & SOLVENT EXTRACTED OILS.

# అఖిల భారత శ్రీశైల క్షేత్ర ఆర్యవైశ్య నిత్య అన్నపూర్ణ సత్రం

స్థాపితం 1961

**హెడ్ ఆఫీసు : కంభం**-523 333. ప్రకాశం జిల్లా. ✆ : 32262 (S.T.D 08406)

**బ్రాంచి ఆఫీసు : శ్రీశైలం**-518 101. కర్నూలు జిల్లా. ✆ : 87158 (S.T.D. 08524)

అతి పవిత్రమైన జోతిర్లింగములలో రెండవది ఐన శ్రీశైల మహాక్షేత్రము పూర్వము దేవతల చేత, రాజుల చేత సేవింపబడిన విషయం పురాణముల ద్వారా వినుచున్నాము ఐనను 1960 సం॥కు ముందు రవాణా సౌకర్యములు లేక గత వైభవము తగ్గినదనుటలో సందేహములేదు ఒకవైపు రవాణా సౌకర్యములు మెరుగు అగుట, మరియొకవైపు అత్యంత శక్తివంతమైన కాపర్ డ్యామ్ ప్రక్కనేనున్న పవిత్రమైన కృష్ణానదిపైన నిర్మింపబడినందున యాత్రికుల రాకపోకలు అధికమైనవి.

1961 సం॥కి ముందే కేవలం మహాశివరాత్రి పర్వదినములలో వైశ్య యాత్రికులకు భోజన వసతులు కల్పించుచున్నా, మన కంభం వైశ్య సోదరులు నిత్యం వచ్చి పోవు యాత్రికుల యిబ్బందులు గమనించి ఎలాగైనా వైశ్య నిత్య అన్నదానము జరుప వలయుననే సంకల్పముతో 1961న శ్రీ భ్రమరాంబా మల్లికార్జునుల వారి అనుగ్రహంతో కంభం వైశ్య సోదరులు ఒక సంఘముగా ఏర్పడి బాడి రిజిష్టరు చేయించి నిత్య అన్నదానం జరుపుచుండిరి 1963లో దేవాదాయ శాఖ కేటాయించిన స్థలమున పూజ్యశ్రీ సత్యసాయిబాబా గారి సువర్ణ హస్తములతో 5 12 63వ తేదీన శంకుస్థాపన గావింపబడినది అట్టి ఈ అఖిలభారత శ్రీశైలక్షేత్ర ఆర్యవైశ్య నిత్య అన్నపూర్ణ సత్రం, శ్రీశైలం దినదినాభివృద్ధి చెందుచూ ప్రస్తుతం అన్ని సౌకర్యములు గలిగిన 115 గదులు, భోజనశాల, ప్రార్ధనామందిరం, కళ్యాణ మండపం, సమావేశ భవనము, గోసంరక్షణశాల, 24 గంటలు నీటి వసతి కలిగి పలు ప్రాంతముల నుండి వచ్చు యాత్రికుల మన్ననలనుబడయుచున్నది నిత్యం రెండు పూటలు అన్నదానం జరుపుచూ, మహాశివరాత్రి పర్వదినముననూ, ప్రతి కార్తీక మాసము రెండవ సోమవారం నుండీ మూడవ సోమవారం వరకూ జరుగు వార్షిక శంకర శివనామ సప్తాహము సందర్భముననూ వచ్చు వేలాది వైశ్య యాత్రికులకు ఉచిత భోజన వసతి సౌకర్యములు కల్పించుచు వినోద కార్యక్రమములు నిర్వర్తించుచున్నాము ఈ క్రింద తెలిపిన పద్ధతుల మేరకు పై మన సత్రమునకు పైకం చెల్లించిన దాతలందరు ప్రశంసనీయులు

అక్షయ మహారాజ పోషకులు : ఈ సత్ర సంఘమునకు రు 11,500-00లు సమర్పించిన దాతలు అక్షయ మహారాజ పోషకులుగా పరిగణించబడుదురు అట్టి పైకమును షెడ్యూల్ బ్యాంకలలో ఫిక్స్‌డ్ డిపాజిట్ చేయబడి అందుపై వచ్చు వడ్డీతో ప్రతి సంవత్సరము దాతకోరిన పేరుతో ఒక మహారాజ పోషక సభ్యత్వం పొందు సదుపాయం గలదు అట్టి సభ్యత్వం పొందు దాతలు, మహారాజ పోషకులుగా పరిగణింపబడుదురు అక్షయ మహారాజ పోషకులు "18×15" అంగుళములు గల దాత ఫోటో (ల్యామినేషన్) సత్రం ఆఫీసు నందు బిగించబడును

రు 1160-00 ఇచ్చిన దాతలు ఈ సత్రమునకు మహారాజ పోషకులుగాను, సర్వసభ్య సమావేశమునకు సభ్యులుగాను ఉందురు ప్రతి సంవత్సరము దాతకోరిన రోజున వారి పేర సత్రములో యాత్రికులైన వైశ్య సోదరులకు సంతర్పణ జరుపబడును ఆ రోజు రాత్రి దాతపేర సాదువులకు అన్నదానము చేయబడును "12×10" సైజులో దాత ఫోటో (ల్యామినేషన్) సత్రావరణములో పెట్టబడును

రు 116-00లు ఇచ్చిన దాతలు ఈ సత్రమునకు జీవితసభ్యులుగా ఉంటారు ప్రతి కార్తీక శుద్ధ పాడ్యమి రోజున వీరందరి తరపున శ్రీ భ్రమరాంబా సహిత మల్లేశ్వర స్వామి వారికి కళ్యాణము జరిపించి, పూజా ప్రసాదాలు, సత్రము యొక్క జమ, ఖర్చులతో పోస్టు ద్వారా దాతలకు పంపబడుతాయి

యన్ బి ప్రతి యొక్క స్తోమత కలిగిన వైశ్య సోదరులు ఏదో ఒక పద్ధతిన సహకరించి సత్రాభివృద్ధికి తోడ్పడగలరని ఆశించుచున్నాము

పోలిశెట్టి సత్యనారాయణ — యక్కలి బాలరత్నం

అధ్యక్షులు — మరియు కార్యవర్గ సభ్యులు — ప్రధాన కార్యదర్శి

వైశ్య ప్రబోధిని

(మాసపత్రిక)



స్థాపితము

1969



సంపుటి

28



సంచిక

12



ఆగస్టు - 1997



సంపాదకులు .

'సంఘోద్ధారక'

'వైశ్యభూషణ'

పి.లక్ష్మీకాంతం శ్రేష్ఠి



ప్రాప్తిస్థానం :

వైశ్య ప్రబోధినీ

కార్యాలయం

"వాసవీ భవన్"

జయనగర్ కాలనీ,

కడప - 516 002.

ఫోన్స్ - 24911, 25025.


సంపాదకీయం

# చరితార్థజీవనుడు సీతయ్యగుప్త

సీతయ్యగుప్తగారు స్వర్గస్తులయ్యారు.

అబ్బ! ఎంతటి దురదృష్టవార్త. ఎంతటి విషాదవార్త ఎంతటి ఆవేదనకర వార్త. తలచుకొంటే హృదయాలు తరుక్కుపోతాయి

ఆర్యవైశ్యులకు - ముఖ్యంగా భాగ్యనగరములోని ఆర్యవైశ్యులకు వీరులేని లోటు ఎన్నటికీ తీరనిది.

ఈ తరం వైశ్యుల అసమాన పట్టుదల, దాతృత్వానికి ప్రతీక - రాష్ట్రరాజధాని సెక్రటేరియట్‌రోడ్డులోని వాసవీనగర్. కోట్లాది రూపాయల విలువచేసే ఈ వాసవీనగర్ నిర్మాణము సీతయ్యగుప్తగారి అకుంఠితదీక్ష, అద్భుత ధైర్యసాహసాల ఫలితమే అనడం అతిశయోక్తికి తావులేని ఊసు.

గుప్తగారు నిష్కపటి నిష్పక్షపాతి నియమబద్ధజీవి ఆర్య సమాజవాది నిత్యము అగ్నిని ఆరాధించేవారు అసమాన ధైర్యశాలి నిండైన విగ్రహము.

వాస్తవమైన కార్యకర్తను గుర్తించడములోనూ - ఆతనిలోని ఉదాత్త సేవాభావాన్నీ - ప్రతిభనూ - ప్రత్యేకతనూ గమనించి అభినందించడములోనూ గుప్తగారి తర్వాతే ఎవరైనా.

ఈనాడు నిజమైన . కార్యకర్తనూ, ఆతని కృషినీ గుర్తించే ఒకరిద్దరు వైశ్యనాయకుల్లో గుప్తగారూ ఒకరు

తమకు అవసరమైతే తలమీద ఉంచుకొని - తమ అవసరాలు తీర్చుకొని - ఆ తరువాత ఆతన్ని గాలికి వదిలివేసి తమ గొప్పను చాటుకొనే వైశ్యనాయకులే ఎక్కువగా ఉన్నట్టిది ఈనాటి వైశ్యసంఘవ్యవస్థ. ఎదురుగా పొగడే - వెనుక తెగడే వారిని ప్రేమించినంతగా - ఎదుటా వెనుకా ఒకే రీతిగా

మాట్లాడేవారిని ప్రేమించలేని నైజము ఈనాటి వైశ్యనాయకులది పనిచేసే వానికీ పదవియా! అని ఆలోచించేస్వభావము ఈనాటి వైశ్యనాయకులది తమ అభ్యున్నతికీ - తాము అందలం ఎక్కడానికీ అవసరమైనప్పడు మాటల్లో, - వ్రాతల్లో పొగడడములో 'ఫస్ట్' - 'బెస్ట్' ఈనాటి వైశ్యనాయకులు తమకు అంతగా ఉపయోగపడిన వ్యక్తి - పొరబాటున పదవిని అడిగితే పెదవిని విప్పడానికి కూడ మనస్కరించని వారు ఈనాటి వైశ్యనాయకులు

సీతయ్యగుప్తగారు ఇలాంటి 'వాహినీవారి పెద్దమనిషి' కారు ఇష్టమైనా-కష్టమైనా ముఖాన్నే మాట్లేడే మంచిమనస్సు గలవారు సీతయ్యగుప్తగారు

సీతయ్యగుప్త గారంటే కొత్తూరి సీతయ్యగుప్తగారు

గుప్తగారు విషయ సంపూర్ణతగల మంచివక్త సుదీర్ఘమైన గుప్తగారి ఉపన్యాసాల్లు ఒక్కొక్కప్పుడు విసుగును పుట్టించవచ్చు కానీ - ఆయన ఉపన్యాసాన్ని ఇచ్చేందుకు తయారై వచ్చే తీరు నిస్తుల ప్రశంసనీయము ప్రగల్భాలులేని పలుకులు గుప్తగారివి మభ్యపెట్టి మాట్లాడటం ఆయనకు చేతగాదు

ఇప్పటి కొందరు వైశ్యనాయకులవలె కడుపునిండా విషాన్ని ఉంచుకొని మధురంగా మాట్లాడడము గుప్తగారికి అలవాటులేనిది

ఏ సభకు వచ్చినా ఆయన చక్కగా తయారైవస్తారు పుస్తకావిష్కరణకు వచ్చేముందు ఆయన తా నావిష్కరించనున్న ఆ పుస్తకాన్ని ఆమూలాగ్రంగా చదివి అవసరమైన అంశాలను మరీ మరీ గుర్తుపెట్టుకొని వచ్చేవారు ఆషామాషిగా ఆయన ఏ ఆవిష్కరణ సభలోనూ మాట్లాడి ఎరుగడు.

వైశ్యుల అభివృద్ధికీ, వైశ్యసంఘ పురోగమనానికీ నిరంతర కృషిచేసిన గుప్తగారు ఏ వైశ్యసంఘములోనూ సభ్యులుకారు వీరిని దృష్టిలో పెట్టుకొనే వైశ్యమహాసభ జిల్లా సంఘాలకు ఐదుమందిని కో-ఆప్టు చేసుకొనే పద్ధతిని నియమావళిలో చేర్చింది. చివరి కానియమము ప్రయోజనములేనిది కావడం విచారకరం

'సిద్ధాంతశాస్త్రి' అను బిరుదుగల సీతయ్యగుప్తగారు అచ్చమైన జాతీయవాది ఆర్యసమాజ ధర్మప్రవర్తకుడు

10-8-1911వ తేదీన జన్మించిన గుప్తగారు అధిష్ఠించిన పదవులు అనేకము. ఆయన చల్లని హస్తాలో పెరిగి అందలంఎక్కిన సంస్థలు అగణ్యము.

సార్వజనీన సేవలో పునీతుడైన గుప్తగారు కృతార్థులు. ధన్యజీవులు.

స్వాతంత్ర్య స్వర్ణోత్సవ వ్యాసము

# శనగపల్లి రామస్వామి గుప్త

- పి. లక్ష్మీకాంతం శ్రేష్ఠి, సంపాదకులు

ఆంధ్ర మహాపురుషుల్లో రామ స్వామి గుప్తగారొకరు ఆంధ్రదేశాభిమానం ఆయనలో ఉరకలు వేసేది. ఆంగ్లములో అనర్గళంగా భాషించే శక్తి గలిగీ ఆయన తన ఉపన్యాసాలను ఆంధ్రములో యిచ్చుటే యిందుకు తార్కాణము. భారత దేశ దాస్యశృంఖలాలను ఛేదించుటకూ, భారతదేశం నుండి అస్పృశ్యతా పిశాచాన్ని పారద్రోలుటకూ గుప్తగారు అనిర్వచనీయ మైన కృషిని చేశారు. అస్పృశ్యత అనేది వేదములుగానీ, శాస్త్రములుగానీ పేర్కొన్నది కాదనీ, స్వార్థపరులు సృష్టించిందనీ యెలుగెత్తి చాటిన మహనీయుడు గుప్త.

గుంటూరు, కృష్ణా మండలాలలో ఆనాడు గుప్తగారిని మించిన ఉపన్యాసకులే లేరని ప్రతీతి. హోంరూలు ఉద్యమములోను,, సహాయ నిరాకరణో ద్యమంలోనూ గుప్తగారు ప్రధాన పాత్రను వహించి మహాత్ముని దీవెన లందుకొన్నారు.

1928లో కలకత్తాలో పండిత మోతీలాల్‌నెహ్రూ అధ్యక్షతన జరిగిన అఖిలభారత కాంగ్రెసు మహాసభకు వెళ్ళి అచ్చట జరుగు విషయనిర్ణయనసభ (సబ్జక్టు కమిటి)లో పాల్గొని భారత దేశమునకు సంపూర్ణ స్వాతంత్ర్యమేగానీ అధినివేశ రాజ్యాంగ పద్ధతి యెంత మాత్రమూ పనికిరాదని వాదించారు.

రామస్వామిగుప్తగారు 1860వ సంవత్సరంలో శనగపల్లిచిన్నఅప్పన్న, మాణిక్యమ్మల పెద్దకుమారుడుగా కర్తరీ పురము (గుంటూరు)న జన్మించారు. గుంటూరు నందలి నగరోన్నత పాఠశాల (టౌన్ హైస్కూలులో) చదివి ప్రవేశ పరీక్ష (మెట్రిక్యులేషన్)లో ఉత్తీర్ణులైనారు.

శనగనపల్లివారి మూలస్థానము నెల్లూరు జిల్లాలోని 'తెట్టు 18వ శతాబ్దికి పూర్వమే వీరి పూర్వులు గుంటూరు చేరు కొని స్థిర పడ్డారు. వీరి పూర్వీకుల్లో గురవ శ్రేష్ఠి మిక్కిలి ప్రశస్తిని పొందిన వ్యక్తి. ఫ్రెంచి రాజ ప్రతినిధి (గవర్నరు). "కాంటి డిలాలి" గారి కాలమున గురవశ్రేష్ఠి సహాయాలోచనకారిగా ఉండి గుంటూరు పట్టణమునకు ఆగ్నేయదిశన లాలి పురమును కట్టించాడు. గురువశ్రేష్ఠి మిక్కిలి శిష్టాచార పరాయణుడు. నిస్తుల దానధర్మ సత్క్రియాలోలుడు. దయార్థ్ర హృదయుడు కూడ. ఒక గర్భిణీస్త్రీకి పడిన మరణశిక్షను తప్పించిన పుణ్యశీలి. ఇతర జలాపానమున కన్న కూపజల సేవనము ఆరోగ్య ప్రదము. అందుకే గర్భిణీ స్త్రీలకు ప్రసవ వేదన సమయములో కూప జలసేవనము అందించటం. అందు వలన గురువ శ్రేష్ఠి గారు లాలిపురమున పెక్కు కూపము (బావు)లు త్రవ్వించాడు.

వైశ్యప్రబోధిని, ఆగస్టు 1997

ఆ కాలమున కర్తరీ పురమునందున్న మరొక ప్రముఖ వైశ్య కుటుంబము చేగు సుబ్బరాయుడు గారిది వీరి తమ్ముడు కనకరత్నంగారూ, గుప్తగారూ సహ పాఠీయులు ఇర్వురూ ఒకే తూరి మెట్రిక్యులేషన్ పూర్తి చేశారు కనకరత్నం గారు ఆంగ్ల భాషయందసమాన పాండిత్యాన్ని గడించగా, గుప్తగారు గీర్వాణాంధ్రాంగ్ల భాషల్లో శేముషీధురీణులయ్యారు కనకరత్నంగారు గుప్తగారి కుటుంబ జీవనోపాధి విషయములో తగిన శ్రద్ధ తీసుకొనేవారు రామస్వామి గారు ధనార్జనా కృషి సలుపలేదు పైగా వచ్చిన ద్రవ్యాన్ని నిర్ణీతముగా వాడుకొనుటయందు లక్ష్యమున్న వాడు కాదు. గుప్తగారి జీవితనావ యిట్లే ఆర్థికపు టిక్కట్టుల కుదుపులలో సాగినట్లుంది. అయితే యింటికి వచ్చిన అతిధులను సముచిత రీతిన సత్కరింపక మానుకొనే వారు కారు.

కనకరత్నం గారూ, గుప్తగారూ కలసి 1884లో గుంటూరులో రాత్రి పాఠశాలన్ను స్థాపించారు. చేగువారు ఉచితముగా యీ విద్యాలయానికి భవనమును సమకూర్చుటే గాక అవసరమగు ఆర్థిక సహాయాన్ని కూడ చేశారు

కనకరత్నంగారికి సంగీతం అంటే వల్లమాలిన అభిమానం. ఎఫ్.ఎ. పరీక్షకు తిలోదకా లిచ్చి గుంటూరులో నాటకశాలను యేర్పరచి నాటక కళాభివృద్ధికి తల పడినారు. మొన్న మొన్నటి వరకు గుంటూరు సెకండ్ కంపెనీగా పేరు పొందిన నాటకశాల ఈ కనక రత్నంగారు స్థాపించిందే. కనకరత్నంగారు తలపెట్టిన నాటకకళాభివృద్ధి కార్యక్రమాల్లో తల దూర్చవలసి వచ్చుటచే గుప్తగారు పై చదువులకు వెళ్ళుటకుగానీ, ఉద్యోగ సముపార్జనకుగాని ప్రయత్నించలేక పోయారు తదుపరి గుంటూరులో ఉన్నత విద్యాపాఠశాల (కాలేజి) యేర్పడినపుడు కొంతకాలము గుప్తగారు రైటరుగా పని చేశారు గౌరవనీయ "ఉల్స్" గారప్పుడు ప్రిన్సిపల్

గుప్తగారూ, కనకరత్నం గారూ యిర్వురూ మంచి ఉపన్యాసకులే. ఆంగ్లమునందు ఉపన్యసించుటలో గుప్తగారి కన్నా కనకరత్నంగారే కొంచెం మిన్న అయినా. విద్యార్థిదశలో కాలేజీలో సబ్ కలెక్టరుగారి అధ్యక్షతన జరిగిన డిబేటింగ్ ఫంక్షన్‌లో విద్య అధికమా? పరాక్రమం అధికమా? అను అంశాలపై యిర్వురూ ఉపన్యసించి సమఉజ్జీలనిపించుకొన్నారు. గుప్తగారు ఆ డిబేటింగ్ లో పరాక్రమమే అధికమని ప్రసంగించారు.

గుప్తగారు విద్యార్థిదశ నుండే దేశం యొక్క దుర్బలత్వాన్ని గుర్తించి మాతృదేశ దాస్యవిదళనోద్యమానికి నడుంకట్టారు మహాత్ముడు ప్రారంభించిన హోంరూల్ లీగ్ ఉద్యమంతో ప్రభావితులై గుప్తగారు స్వయంగా స్వాతంత్ర్యసమరశంఖాన్ని పూరించారు. అప్పటి నుండీ ఖద్దరు ధారణను దీక్షతో సాగించారు.

1921 లో పొన్నూరులో జరిగిన 30వ గుంటూరు మండల మహాసభకు గుప్తగారధ్యక్షత వహించారు. ఈ సభలోనే నగర పాలక సంఘ సభ్యుల (మున్సిపల్ కౌన్సిలర్స్)ను నామినేట్ చేయకుండా

ఎన్నుకొనే పద్ధతిని యేర్పరచాలని నాటి ఆంగ్ల ప్రభుత్వాన్ని కోరుచూ తీర్మానాన్ని చేయించి దానికి ప్రభుత్వామోదాన్ని గూడ పొందారు 1921 లో గుప్తగారు గుంటూరు నగరపాలక సంఘానికి సభ్యులుగా ఎన్నికయ్యారు. అంతకు ముందు 1921లో గుంటూరులో జరిగిన కృష్ణా మండల సభకు గుప్తగారే కారణ భూతులయ్యారు

పారిశ్రామికాభివృద్ధి ద్వారానే ప్రజల జీవన స్థితి మెరుగు కాగలదన్న విశ్వాసంగల గుప్తగారు ఏలూరులోనూ, గుంటూరు లోనూ నారయంత్రముల (జ్యూట్ మిల్సు)ను యేర్పాటు చేయుటకు కృషి చేశారు.

ప్రజాహిత కార్యక్రమాల్లో నిత్యం పాల్గొంటున్నా గుప్తగారు యెప్పుడూ విసుగు చెందలేదు. గుంటూరు మండలాలకు రాజప్రతినిధి మున్నగు ప్రధానాధికారులు వచ్చునపుడు వారిని ఒకటి రెండు స్టేషనులు ముందుగానే కలునుకొని, మండలాభివృద్ధికి చేయవలసిన పనులను గూర్చి వివరించి, వారితో పరిచయాన్ని కలిగించుకొని నగర ప్రముఖులను వారికి పరిచయం చేసేవారు.

గుప్తగారు శుద్ధ విశిష్టాద్వైత (వైష్ణవ) మత సాంప్రదాయమును కఠినముగా పాటించేవారు. అడ్డబొట్టువారు (స్మార్తులు) అంటే ఆయనకు ససేమిరాగిట్టేది కాదు. ఆయన కుమార్తె లందరినీ నిలువ బొట్టు వారికే సాలంకృతకన్యాదానంగా యిచ్చి వివాహం చేశారు. ద్విజులు ఏకాహ్నికంగా (ఒకరోజు) వివాహం చేసుకోరాదనీ, పంచాహ్నికంగానే వివాహం చేసుకోవాలనే విషయాన్ని గుప్తగారు చివరివరకూ పాటించారు.

దశరధుని భార్య సుమిత్ర వైశ్య వంశ సంజాత అని గుప్తగారి అభిప్రాయం అయితే ఆయన ఆవిధంగా యే గ్రంధం ఆధారంగా అనేవారో తెలియుట లేదు రామాయణంలో సుమిత్ర యేరాజు కూతురైందీ తెలుపకపోవుట చేతను, పుత్రకామేష్టి ద్వారా లభ్యమైన పాయసాన్ని దశరధుడు కౌసల్య, కైకేయీలకు మాత్రమే పంచుటచేతను, "క్షత్రియశ్చాపి వైశ్యశ్చ, క్రియా శంతౌశుచిత్రః హాస్యకవ్యై ద్విజైరోభజ్యం' ' 'అని యన్నందున బ్రాహ్మణ, క్షత్రియులు ఒకరిండ్లలో ఒకరు కుడుచుట కాక్షేపణ మా కాలమున లేనందున గుప్తగారు యిట్లు భావించి ఉండవచ్చు.

మాతృశ్రీ కన్యకాపరమేశ్వరీ కధ పశ్చిమ చాళుక్యుల కాలంలో జరిగిందనీ, దాన్ని పురాణములోనికి తీసుక వెళ్ళి భాస్కరాచార్యులకు ప్రధాన్యతను కల్పించి స్వార్ధపరులగు కొందరు బ్రాహ్మణులు తమ ఆధిక్యతను వైశ్యులపై రుద్ది సంభావనలు పుచ్చు కొంటున్నారనీ గుప్తగారి భావము.

స్వసంఘమును నిద్రావస్థ నుండీ మేల్కొలిపి, ఆర్యవైశ్యమహాసభలను ప్రారంభించి సంఘమును సర్వ విధముల్లా పునరుద్ధరించిన మహనీయమూర్తి గుప్తగారు. గుప్తగారు పాల్గొనని వైశ్య మహాసభలే ఆ కాలమున లేవంటే అతిశయోక్తి కించిత్తుకూడ కాదు. వైశ్య సంఘానికి ఆయన చేసిన సేవలకు గుర్తుగా 1921లో విశాఖపట్టణమున జరిగిన పదకొండవ వైశ్య మహాసభలో గుప్తగారికి "వైశ్యరత్న" అను బిరుదునిచ్చి

సత్కరించారు. ఆనాటి ఆ సభకు బారటాటి ఆదినారాయణశ్రేష్ఠి గారు అధ్యక్షత వహించారు. ఈ సభలోనే గుప్తగారు రజస్వలానంతర వివాహ విషయాలపై విపులంగా ఉపన్యసించి తీర్మానము ఏకగ్రీవంగా ఆమోదింప బడునట్లు చేశారు. మఱియు యీ సభలోనే "లింగధారి వైశ్యులను సహపంక్తిలో గూర్చుండునట్లుగా అంగీకారమును పొందిరి. ఈ తీర్మాన ఫలితంగానే 1924లో జరిగిన 12వ వైశ్య మహాసభలో లింగదారులు విచ్చేసి సహపంక్తి భోజనాన్ని చేశారు

1910లో విజయనగరంలో శ్రీమాన్ తిరువేంగడత్తాన్‌శ్రేష్ఠి గారి అధ్యక్షతన జరిగిన చతుర్ధ వైశ్య మహాసభలో గుప్తగారు పాల్గొని విదేశీగమనం చేసిన వైశ్యుల విషయంలో గంభీరోపన్యాసం యిచ్చి వారికి కూడ సహపంక్తి భోజనార్హతను కలిగించుటకు తీర్మానాన్ని చేయించారు. కానీ యీ తీర్మానాన్ని పలువురు ప్రతిఘటించుట వలన ఆచరణకు రాక, 1924లో గుంటూరులో జరిగిన 12వ మహాసభలో ఈ తీర్మానము రద్దు చేయబడినది.

1908లో మైసూరులోను, 1921లో గుల్బర్గాలోను జరిగిన వైశ్య మహాసభల్లోను గుప్తగారు పాల్గొన్నారు. గుంటూరులో జరిగిన ఒక అవసర వైశ్యమహాసభకు గుప్తగారు ఆహ్వాన సంఘాధ్యక్షులుగా ఉండినారు.

శారదాబిల్లు విషయమై విఛారణ సలుపు పెద్దల్లో గుప్తగారు ఒకరుగా ఉండి రజస్వలానంతర వివాహము శాస్త్ర సమ్మతము దేశ కళ్యాణ ప్రదమని నిరూపించారు.

స్త్రీ పునర్వివాహ విషయంలో గుప్తగారు తటస్థీకులు, అయినా గంగారాంగారి ధర్మనిధి ఆధారంగా పంజాబులో యేర్పడిన "పంజాబు విధవా వివాహ సహాయక సంఘ" శాఖను గుంటూరులో ప్రారంభించినపుడు గుప్తగారందులో సభ్యులు.

ధశరాత్రాశౌచము, అన్న శ్రాద్ధము మొదలగు వైదిక కర్మలు ప్రధమమున గుంటూరులో ప్రారంభించింది గుప్తగారే క్రీ॥ శ॥ 1917లో గుప్తగారి ధర్మపత్ని మరణించింది. అప్పట్లో ఆయన యీ దశరాత్రాశౌచాన్ని తలపెట్టగా స్వగోత్రీకులే వ్యతిరేకులై యింటికి రాకుండా సమ్మె చేయుటయే గాక, ఒప్పుకొన్న పౌరోహితున్ని రాకుండా చేశారు. కానీ గుప్తగారు గ్రంధిరంగార్యుల తోడ్పాటునూ పుస్తక సహాయాన తీసుకొని విధియుక్తంగా అశౌచ కార్యక్రమాన్ని నిర్వహించారు.

గుప్తగారు గొప్ప ఉపన్యాసకులు. ఆయన ఉపన్యాసంలో 2 గ్రామ్య పదమొక్కటి గూడ ఉండేదికాదట. గ్రంధస్థ భాషా విరాజితమై ఆయన ఉపన్యాసం అలరారేదట. లలితపద విరాజితమైన గుప్తగారి ఉప న్యాసశైలి గంభీరనిస్వనము, బహు దూరాకర్ణితము, జనాకర్షణము, రస పూరితమును, శబ్దవిరాజితము, ఆనంద దాయకము అని ప్రశంసలందుకొంది. గుప్తగారి ప్రసంగంలో హాస్య రసమెక్కువగా ఉండేది. అద్భుతరసము సమయస్ఫూర్తిగా ప్రవహించేదనీ, శ్రోతల కన్నులనుండీ నీరుగారించే విధంగా ఒక్కొక్కప్పుడు గుప్తగారు తన ఉపన్యాసంలో దుఃఖ రసాన్ని సైతము ఒలికించేవారనీ, ఆయన

ఉపన్యాసాలను స్వయంగా విన్న స్వర్గీయ గ్రంధి వెంకటసుబ్బరాయశర్మగారు వ్రాశారు.

1891లో నాగపూర్ లో జరిగిన దేశీయ మహాసభలోను, 17-4-1921న మద్రాసులో జరిగిన చెన్న రాష్ట్రీయ సభలోను గుప్తగారు కృష్ణా మండల ప్రతినిధిగా పాల్గొన్నారు.

గుప్తగారు వైదిక పాఠశాలను ప్రారంభించి కమ్మ, వైశ్య పౌరోహితులను తయారు చేశారు.

శుక్లనామ సంవత్సర బాధ్రపద శు॥ లు గురువారం సరియగు 12-9-1929వ తేదీన రామస్వామి గుప్తగారు స్వర్గీయులయ్యారు. 13-9-1929 వ తేదీన గుంటూరులో జరిగిన గుప్తగారి అంతిమయాత్రలో ఆయన శవమును అనేకులు వచ్చి భుజములు మార్చుకొంటూ ప్రేత భూమికి మోసుక పోయారు.

ఆనాటి ఏకైక దిన పత్రిక 'ఆంధ్ర పత్రిక' గుప్తగారి మరణమును గూర్చి సంపాదకీయాన్ని వ్రాసింది. 'సమదర్శిని' మున్నగు ప్రముఖ పత్రికలు గూడ గుప్తగారి మరణ విషయంలో సంపాదకీయాలను వ్రాశాయి .

13-9-1929వ తేదీన గుంటూరు పుస్తక భాండాగారమున అల్లాడి కుప్పుస్వామిగారు అధ్యక్షతన జరిగిన సానుభూతిసభలో గుప్తగారి శిలావిగ్రహాన్ని గుంటూరులో ప్రతిష్ఠించాలని తీర్మానించారు. కానీ ఆ తీర్మానము తీర్మానంగానే మిగిలి పోయింది

వైశ్యప్రబోధిని, ఆగస్టు 1997

## తిరుపతిలో పద్మావతీ నిలయం (కళ్యాణ మంటపం) ప్రారంభం

దక్షిణ ఇండియా ఆర్యవైశ్య శ్రీ వాసవీ కన్యకాపరమేశ్వరీ ధరపరిపాలనా సంస్థవారు తిరుపతి పట్టణములోని తిరుపతి-తిరుచానూరు రోడ్డులో కోటి రూపాయల వ్యయముతో నిర్మించిన పద్మావతీ నిలయము (కళ్యాణ మండపము)ను 18-7-1997వ తేదీన అప్పటి రాష్ట్రపతి శ్రీ శంకర్ దయాల్ శర్మగారు ప్రారంభించారు. ఈ సందర్భంగా జరిగిన సభకు పై సంస్థ అధ్యక్షులు శ్రీ కె. రాధాకృష్ణయ్య గారు అధ్యక్షత వహించగా మాజీ మంత్రి వర్యులు శ్రీ కె. రోశయ్య గారు ఈ సభకు ముఖ్య అతిథులుగా పాల్గొన్నారు. ఈ సంస్థ మేనేజింగ్ ట్రస్టీ శ్రీ ఆర్.ఆర్ నాధం, వారి సతీమణి శ్రీమతి కౌసల్య గారు శంకర్ దయాల్ శర్మ, వారి సతీమణి శ్రీమతి విమలశర్మ గారలను ఘనంగా సత్కరించారు.

## బ్రాహ్మణ విద్యార్థులకు శుభవార్త

కడపజిల్లాలోని పెన్నానదీ తీరమున "శ్రీసాయణ విద్యారణ్యవేదవిద్యా పరిషత్ ట్రస్టు" వారిచే నిర్వహింపబడు వేద పాఠశాలలో బ్రాహ్మణ విద్యార్థులకు ఉచితముగా భోజన - నివాస వసతులతో వేదము - షోడశకర్మలు ఋగ్వేద, యజుర్వేద, పౌరోహిత భాగములూ మొదలగు వాటిని అనుభవజ్ఞులైన పండితులతో నేర్పిస్తున్నారు. ఆసక్తిగల బ్రాహ్మణవిద్యార్థులు 'శ్రీసాయణ విద్యారణ్య వేదవిద్యాపరిషత్ట్రస్టు' పాఠశాల, పెన్నానదీ తీరము, యర్రగుంట్ల రోడ్డు, ప్రొద్దుటూరు, కడప జిల్లాకు దరఖాస్తు చేసుకోవలెను.

# శ్రీ వాసవీ కన్యకా పురాణం

మూలం : వ్యాసప్రణీత స్కాంధ పురాణం

స్వేచ్ఛానువాదము : శ్రీ పి. లక్ష్మీకాంతం శ్రేష్ఠి (సంపాదకులు)

(గత సంచిక తరువాయి)

"కిరాతకుని మాటలు విన్న ఆ ధర్మనందనుడు ఆ బ్రాహ్మణుని విడిపించి, ఆ బ్రాహ్మణుని కంఠము నందున్న పాశమును తన మెడకు వేసుకుని, వ్యాధుడా! నీ యిష్టము కొఱకు త్వరగా నన్ను మహాదేవి అగు శక్తికి బలి యివ్వుము" అని చెప్పెను. పాపాత్ముడైన ఆ కిరాతకుడు వెంటనే ఆ ధర్మనందనుని తీసుకొని, అచ్చటచ్చట గల మృగములను చంపుచూ ఉత్సాహముతో పోయెను. తాను చంపిన ఒక లేడినీ, రెండు కుందేళ్ళనూ, ఐదు తోడేళ్ళనూ, ధర్మనందనుని తలపై పెట్టి పులులతోనూ, ఎలుగుబంట్లతోనూ కూడి ఆ అరణ్యము నందు వేగముగా పోవు చుండగా మధ్యాహ్న కాలము అయ్యెను. సూర్యుడు మండుచున్న కిరణములు కలవాడయ్యెను. ఆ వేడిమితో దహింపబడి ధర్మనందనుడు దుర్బలుడయ్యెను.

17 1/2 - 22 అ.4 - పుట 33

గొంతు ఎండిపోయి ఆకలి, దప్పికలతో కూడి ఆ ధర్మనందనుడు భూమిపై పడెను. దయలేని ఆ కిరాతకుడు క్రిందపడిన వైశ్య బాలకుని పట్టుకొని కొరడాతో విపరీతంగా కొట్టుచూ, "ఓరీ దుష్టబుద్ధీ! కులహీనుడా! వడి వడిగా నడువుము" అని కఠినమైన మాటలతో బెదిరించెను. క్రింద బడిన ధర్మనందనుడు లేచి, తన ధర్మమును తలచుకొని, గురువుయొక్క పాదమును ధ్యానము చేసుకొనుచూ, కిరాతకుని పలుసార్లు బ్రతిమాలుచూ, వాని వెంట వెళ్ళెను. బరువును ఎత్తుకొన్న ధర్మనందనుడు మెల్ల, మెల్లగ కొంత దూరము వెళ్ళి, మరల క్రింద పడెను. దయలేని ఆ కిరాతకుడు కోపముతో, త్రాళ్ళతో ఆ బాలుని బంధించి, ముండ్లు, రాళ్ళు, సింహములు, పులులు కలిగి, మనుష్యులు కాని, నీళ్ళు కానీ లేని ఆ అడవిలో బర, బర యీడ్చెను. మూర్ఛలో ఉన్న ఆ ధర్మనందనుడు తిరిగి మూర్ఛ నుండీ తేరుకొని అనేక విధములుగా ఆ కిరాతకుని ప్రార్థించెను. కర్మ ఫలమును అనుభవించక తప్పనందున దురాత్ముడగు ఆ కిరాతకుడు ధర్మనందనుని పై దయ చూపలేదు.

22 1/2 - 29 అ.4 - పుట 33

ఆ సమయమున మగధదేశపురాజు చతురంగ బలములతో ఆ అరణ్యమునకు వేటాడుటకు గానూ వచ్చెను. ఉత్సాహము గల భటులూ, విల్లంబులు పట్టుకొని ఉండు కిరాతకులునూ, అచ్చటచ్చట గల మృగములను చంపి వేసి వృత్తాంతమంతా ఆ రాజుకు తెలిపిరి. 'కిల' 'కిల' అను వారి శబ్దములను విని, ధూళితో కప్పబడిన ఆకాశమును చూచి ఆ కిరాతకుడు "ఈ మహారణ్యమునకు రాజు తన బలములతో

వస్తున్నాడు ఓరీ బాలుడా! నేను ఇచట ఉండరాదు. మరొకస్థలమునకు పోదము. రాజు మనలను చూచిన నన్ను వెంటనే సంహరించును. సందేహము లేదు" అని పలికి ధర్మనందనుని మెడలో ఉన్న పాశమును తీసి అతనిని ఒక పెద్ద బిలములో ఉంచి, "నేను వచ్చు వరకూ ఎదురు చూస్తూ ఉండుము లేకున్న నీవు చంపుటకు అర్హుడవు అగుదువు" అని ఆ బాలునికి చెప్పి ఆ గుహద్వారమును ఒక రాతితో కప్పి అచ్చట నుండి పారిపోయి, ఒక పెద్ద చెట్టును ఎక్కి కూర్చుండి ఆ చెట్టు కొమ్మలతో తన దేహమును కప్పుకొని కదలకుండా ఉండెను

29 1/2 - 36 1/2 అ.4 - పుట 35

మహనీయమూ, కీర్తికరమూ, పరిశుద్ధమూ, బలప్రదమూ, రహస్యమూ అయిన ఈ పురాతన కథను నియమముతో కూడి విన్న వారికీ, చదివిన వారికీ సకల పాపములూ తొలగును.

ఇది స్కాంధ పురాణమందు - సనత్సుజాతీయ సంహిత గల ఉత్తర ఖండమున ధర్మనందునుని చరిత్రను చెప్పే 5వ అధ్యాయము

## ఆరవ అధ్యాయము

"ఓ ఋషివర్యా! ఆ రాజెవ్వరు? ఎందులకు అరణ్యమున ప్రవేశించెను. ఆ పుణ్య కథను మాకు వినిపింపుడు" - అని వైశ్యులు సాలంకాయనుని అడిగిరి.

ఆ కాలములో 'భద్రుడు' అను రాజు మగధదేశాన్ని పాలించు చుండెను. వేటయంతు ఆసక్తి కలిగిన, అతడు చతురంగ బలములు, సమర్థులైన కిరాతకులు, ఉత్సాహవంతులగు ముఖ్య భటులతో ఆ అరణ్యమునకు వేటాడుటకు వచ్చెను.

1 1/2 - 3 అ.5 - పుట 37

పరిజనులందరూ, మృగ సమూహములను వధించి, రాజునకు తెలియజేసిరి. అట్టి భటులకు ధనము, వస్త్రములు, ఆభరణములు ఇచ్చి, మృగములను వధించుటకై వేట తమకముగల ఆ రాజు ఒకటి రెండు మృగములను వేగముగా సంహరించెను ఒక కుందేలు గురిని తప్పించుకొని పరుగెత్తు చుండెను. గుఱ్ఱము నెక్కి ఆ రాజు చాలా దూరము ఆ మృగమును అనుసరించి పోయెను. పరుగెత్తుచున్న ఆ కుందేలును రాజు ఒక ఈటెతో వధించెను.

3 1/2 - 7 అ.5 - పుట 37

తర్వాత, మనోహరమైన ఒక వృక్షము క్రింద ఆ రాజు విశ్రమించెను ఏనుగులు, గుఱ్ఱములతో మంత్రి కూడ అచ్చటికి వచ్చెను. రాజు స్థిమితముగా భుజించి పానీయములను త్రాగుచూ మంత్రి మొదలగు వారితో కూడి ఆనందించు చుండెను. అపుడు దైవవశమున ఆ చెట్టు కొనలలో దాగి ఉన్న దుష్టుడైన కిరాతకుడు ఆ రాజుకు కనిపించెను. అంత, ఆ రాజు కన్నులతోనే కాల్చి వేయునట్లు చుఱ చుఱ చూచెను. "ఈ జన కంటకుడైన కిరాతకుడు చెట్టు కొమ్మలలో దాగి ఉన్నాడు. 'భద్రుడు' అనెడి నేను జీవించి ఉండగా ప్రాణులకు హింస చేయునట్టి ఈ దృష్టాత్ముడు నా దేశము నందుండుటకు శక్యమగునా? అని పలికి, రోషముతో ఎఱ్ఱనైన కన్నులతో ఆ రాజు ఆ కిరాతకుని సంహరింపుడు అని భటులకు ఆజ్ఞాపించెను. భటులు ఆ కిరాతకుని

ఖడ్గములు, భల్లెములు మొదలగు వాటితో భాధించిరి. అతడును ఆ సైన్యముపై అనేక బాణములను వేసెను. కొంత యుద్ధము జరిగిన తర్వాత, ఆ రాజు తన అర్ధ చంద్ర బాణముతో ఆ కిరాతకుని వధించెను.

7 1/2 - 17 12 అ.5 - పుట 39

రాజు సంతోషపడి తన పట్టణమునకు పోయెను.

18 -18 12 అ.5 - పుట 39

మధ్యాహ్నకాలమయ్యెను. భృగు వంశ శ్రేష్ఠుడైన చ్యవనమహర్షి శిష్యులలో ధర్మనందనుని కానక "ధర్మపుత్రుడు ఎచ్చటికి పోయెను. ఎప్పుడూ కాలమును అతిక్రమించువాడు కాడు" అని పలికెను. 'వాడెచ్చటికి వెళ్ళినదీ మాకు తెలియదు' అని శిష్యులు జవాబు చెప్పిరి. శిష్యుని వెదకుటకు చ్యవన మహర్షి అడవికి శిష్యులతో వెళ్ళెను "ఓ ధర్మనందనా! ఎక్కడున్నావు" అని గట్టిగా పిలుచుచు ప్రేమాధిక్యతతో పరితాపమును పొందెను చాలా కాలము అరణ్యములో అతనిని కానక దుఃఖముతో తన గృహమునకు వచ్చి శిష్యుడైన ధర్మనందనుని చూచునంత వరకూ, విడువనని ఒక కాలిపైన్నే నిలబడి ఉండెను ధర్మనందనుని తల్లి తండ్రులు చ్యవనమహర్షి వలన పుత్రుని వృత్తాంతమును విని, బహుకాలము చింతిస్తూ, తమ కుమారుని రక్షించమని జగదీశ్వరిని ప్రార్థిస్తూ ఆ గురువు ఎదుటనే కూర్చుండి ఉండి తుదకు ప్రాయోప ప్రవేశము చేయచొచ్చిరి.

19 - 24 అ.5 - పుట 41

ఓ మునిశ్రేష్ఠా! ఆ వ్యాధనాధుడు గతించిన తరువాత ధర్మనందనుడు ఏమి చేసెను. ఆ ధర్మనందనుని సంగతిని వివరింపుము" అని వైశ్యులు పలికిరి.

24 1/2 - 225 అ.5 - పుట 41

అంత సాలంకాయనులు ధర్మ నందనుని వృత్తాంతము చెప్పుచున్నాను. వినుడు. నాగరాజైన వాసుకి ఆదిశేషుని చూడవలెనను కోరికతో ఈశ్వరుని వద్ద సెలవు తీసుకొని, వెండికొండ నుండి భూలోకమునకు వచ్చి పాతాళమునకు పోవుచూ గొప్ప శిలతో అడ్డగింప బడిన పాతాళబిల ద్వారమును చూచి, నాగరాజగు వాసుకి కోపముతో ఎఱ్ఱనైన కన్నులతో ఆ ఱాతిని ఛేదించెను. ఆ బిలము నందు, మూడు పేటల మొల త్రాడును, జింక ఛర్మమును ధరించి ధ్యానము చేయుచున్న బాలుని చూచి, సర్ప రాజగు వాసుకి ఆశ్చర్యమును పొందెను. "సమస్తములైన పాషాణములు, జంతువులు నా చూపుల వలన తప్పక భస్మమగును. ఈ మానవుడు ఎంత? ధ్యానము మీద ఆసక్తి కల ఈ బాలుడు, నేను చూచినను జపము చేయుచునే ఉన్నాడే?" అని అనుకొని, ధ్యానములో ఉన్న ధర్మనందనుని పిలిచెను

25 1/2 - 31 అ 5 - పుట 43

ధర్మనందనుడు కన్నులు తెరచెను ఎదుట పార్వతీపతియగు ఈశ్వరునికి ఆభరణమైన వాసుకిని చూచెను. శిరస్సు వంచి నమస్కరించెను నాగరాజా! నీకు నమస్కారము. కద్రువపుత్రా! నీకు వందనము. శంకరునికి భూషణమైన వాడా! నీకు నమస్కారము. భక్తులకు ఇష్టుడవగు నీకు వందనము" అని ప్రార్థించి వాసుకి పాదములను పట్టుకొనెను.

31 1/2 - 33 1/2 అ.5 - పుట 43

(ఇంకావుంది)

# శతావధాని వీరాంజనేయం



శోకం నుంచి శ్లోకం పుట్టుకొచ్చింది. అదే మనకు ఆదికావ్యమైంది. రామాయణం పారాయణ గ్రంధమైంది. నిత్యం నియమంగా రామాయణం చదివితే - సంఘంలో దశరధుడి వంటి తండ్రి - రాముడి వంటి కుమారుడు, లక్ష్మణుడి వంటి తమ్ముడు, సీత వంటి ఇల్లాలు తయారవుతారని మనవాళ్ళ నమ్మకం. అన్నదమ్ముల అన్యోన్యతకు - ఆలుమగల అనురాగానికి మనకు రామాయణం దర్పణం వంటిది. ఇంతకూ శోకం నుంచే కదా కవిత్వం పుట్టుకొచ్చింది. ఆర్తినుంచి ఆవేశం నుంచి ఆవేదన మంచి పుట్టుకొచ్చిందే నిజమైన కవిత్వం

కవులు ఒకటో రెండో పద్యాలో, శ్లోకాలో చెప్పగానే - రచించగానే వారి దృష్టి - కావ్యాలు చదివినందువల్ల ప్రబంధాలు పరించినందువల్లా తాము రచన చేయాలని నిర్ణయించుకుంటారు. అలా మనస్సులో భావం ఏర్పడగానే పుట్టుకొచ్చేవి శతకాలు.

శతక రచన అచ్చంగా ఆంధ్రుల సొత్తు. సంస్కృతంలో శతకాలున్నా అవి మొత్తానికి నూరుకు మించక పోవచ్చని నిడదవోలు వెంకటరావు గారన్నారు. నిడదవోలు వారి మాటంటే నిత్యసత్యం లాంటిది కదా! కనుక శతకం మనది. మన భాషలో వున్నన్ని శతకాలు ఇంకే భాషలోనూ వుండవు. శతకాలను లెక్కించడం దాదాపు కష్టసాధ్యం మొట్టమొదట శతక వాఙ్మయాన్ని వెలుగులోకి తెచ్చినవారు వందూరి సుబ్బారావుగారు.

మహాకవులందరూ శతక రచన చేసినవాళ్ళే. ఆధునికుల్లో కవిసామ్రాట్ విశ్వనాధ శతక రచన చేశారు. విశ్వనాధ పంచశతి వ్యంగ్య వైభవం విలసిల్లే శతక పంచకమయితే వరలక్ష్మీత్రిశతి వియోగ రచన. మహాకవి శ్రీశ్రీ కూడా సిరిసిరి మువ్వ శతకం చెప్పారు. నాకొక సిగరెట్టిస్తే నీకొక పద్యంబు చెప్పి నిను మెప్పిస్తా అన్నాడు శ్రీశ్రీ.

శతావధాని అనే మాటకు పర్యాయ పదంగా రాయలసీమలో అవధాన విద్యకు పట్టం కట్టిన వాడిగా డా॥ సి వి సుబ్బన్న శతావధానిని పరిగణిస్తారు ఆయన అష్టావధానాల్లో నిషేధాక్షరి పద్యం తాంత్రిక మంత్రంలా వుంటుంది. ఏకాక్షర నిఘంటువులూ, సాధ్యసమాసాలు, ద్వ్యంద్వాక్షరపదాలతో పద్యం శోభిస్తుంది.

గురువు గడియారం శేషశాస్త్రిగారి ప్రభావంతో అవధానవిద్య చేపట్టినా - రాయలసీమలో తీరాంధ్రంలో నెల్లూరి సీమలో భాగ్యనగరంలో అవధానానికి ఖ్యాతి తెచ్చారు సి.వి. సుబ్బన్న. తిరుపతి వెంకటకవుల తర్వాత అంతటి ప్రశస్తి తెచ్చింది సుబ్బన్నగారే. ఇటీవల

డా॥ మాడుగుల నాగఫణిశర్మ, గండ్లూరి దత్తాత్రేయశర్మ, డా॥ మేడసాని మోహన్ అవధాన విద్యకు అలంకారాలు పొదిగారు.

సి.వి. సుబ్బన్నగారూ ఒక శతకం చెప్పారు. ఆ వీరాంజనేయ శతకం గురించి నాలుగు మాటలు చెప్పబోతూ - అందరి కవులు శతక రచన చేసిన తీరుకు భిన్నంగా శతక రచన చేయడంలోని నేపథ్యంగా సి.వి. సుబ్బన్నగారి అవధానప్రతిభ ప్రస్తావించాను. మామూలు శతకాలకు భిన్నమైన ధోరణిలో నడిచింది ఈ కంద పద్య శోభితమైన వీరాంజనేయ శతకం. శతకానికి మకుట నియమం తప్పనిసరి. వీరాంజనేయ సజ్జనగేయా! అన్నది ఈశతకమకుటం. ఒక పద్యం చూడండి.

అష్టాపద మణిరోచిర్జుష్ట శిరస్తట కిరీట శోభితమూర్తీ!

స్రష్టస్మేర! భవిష్యత్స్రష్టా! వీరాంజ నేయా సజ్జనగేయా!

మొదటి పాదానికి మణిమయ కాంతులతో శోభిల్లే బంగారుకిరీటం శిరస్సున శోభించే వాడా అని అర్థం. భవిష్యత్ బ్రహ్మ కదా మన హనుమ. ఈ విషయం భవిష్యత్స్రష్ట అనే ప్రాసస్థానంలో బంధించారు.

శతకం అంటే శ్రీకాళహస్తీశ్వర శతకం గుర్తుకు రాకపోదు. ధూర్జటి యధేచ్ఛా మనస్తత్వానికి ప్రతీక అది. ఒక పద్యం చూద్దాం.

జాతుల్సెప్పుట సేవచేయుట మృషల్ సంధించుట న్యాయ వి

ఖ్యాతింబొందుట కొండెకాడవుట హింసారంభకుండౌ ట మి

ధ్యాతాత్పర్యము లోడుటన్నియు పరద్రవ్యంబు నాశించి ఈ

శ్రీ తానెన్ని యుగంబు బంద గలదో శ్రీకాళహస్తీశ్వరా!

కాళహస్తీశ్వర శతకంపై ఒక వ్యాసం వ్రాయాలి.

నిజానికి మాడుగుల నాగఫణి శర్మగారు పద్యపద్యానికి విశేష వ్యాఖ్యవ్రాసిన విషయం ప్రస్తావించి తీరాలి. మాటలో మాటగా ఈ శతకంపై రావిశాస్త్రి గారికి ఎంత మక్కువో - అయినా ప్రస్తావనోచితంగా ఎలా పద్యం చదివేవారో పతంజలిగారు ఎప్పుడూ ప్రస్తావిస్తూ వుంటారు. సుమతి శతకం - కృష్ణశతకం - దాశరథీ శతకం ఎంతో తేలికగా నడుస్తాయి.

ధిషణాహంకార సంభారదోషల బ్రహ్మ మయమూర్తి అని అన్నట్టుగా సి.వి. సుబ్బన్నగారి పాండిత్య ప్రతిభలకు తార్కాణగా వుంటుంది ఈ శతకం.

తీక్ష్ణనఖదీర్ణరక్షు

పృక్షఘటావర్ష్మ! భక్తముక్యకవి సుధీ

రాక్షచణ! యభీక్ష్ణకృపా

శ్లక్ష్ణ! వీరాంజనేయ! సజ్జనగేయా!

(మొదటి పాదానికి అర్థం - శతవధాని గారే చెప్పారు. రక్కసులనెడి కొండ చిలువల మేనులు వాడిగోళ్ళతో చించినవాడు)

ఇదెంత బుద్ధిబలంతో రచించిందీ చూస్తేనే తెలుస్తున్నది కదా!

శ్రీరాముని దయసేతను, నారూఢిగ సకల జనులు నౌరాయనగా!

ధారాళమైన నీతులు నోరూరగ చవులుపుట్ట నుడివెద సుమతీ

అనే ధోరణిలో చిన్నప్పటినుండీ శతక పద్యాలు కంఠత పట్టడం అలవాటైన తెలుగువారి ధోరణికి ఎంత భిన్నంగా వుంది ఈ శతక రచన! పిల్లలకు సులువుగా నోటపట్టడానికి అర్థం కావడానికి రెండేళ్ళు నిండినప్పటినుంచీ తెలుగు తాతయ్య మనవలకు నేర్పేవారు ఈ పద్యాలను - ఒకప్పుడు. తెలుగును బొత్తిగా అంటరానిదాన్ని చేసి ఇంగ్లీషు చదువులు చదివే అయ్యలకు వీటితో పనేం?

అయితే సుబ్బన్నగారి తీరేవేరు చూడండి

కవియన నుక్తి చమత్కృతి రవణిలు
కృతిగూర్చుమర్త్యుడా? కవి ధర్మ ప్రవీణుడు
సత్యరతుడు శిష్టవరుడు వీరాంజనేయ! సజ్జనగేయా!

సుబ్బన్నగారికి శిష్టశబ్దంపై మక్కువ ఎక్కువే!

వారు, మా గురువుగారు మద్దులపల్లి వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి గారికి జాబు రాస్తే శిష్టజన (సి) విధేయ (వి) సుబ్బన్న అని రాసేవారు సి.వి.ని విశ్లేషిస్తూ సి.వి. సుబ్బన్న గారికి జాతక భాగం కూడా తెలుసు! వారి అవధానాల్లో ఆ విషయాలు దొర్లుతుంటాయి ఇక్కడ కూడా చూడండి

తోడు గురుడాన్న దోషం .
క్ష్వేడియమన్, మందుడున్న విబుధుడు గేహే
క్ష్వేడి యగున్ లోకేడిత
షాడబు! వీరాంజనేయ! సజ్జనగేయా!

గోష్టేక్ష్వేడి = సభాప్రగల్భుడు. అనగా పురుషులలో రాణించువాడు.

గేహేక్ష్వేడి - గృహ ప్రగల్భుడు. షాడాబము = గానమా అని కవిగారే వివరణ అర్థం ఇచ్చారు. గురువుతోడుంటే సభా గౌరవం వస్తుందట. వాక్చమత్కారం వస్తుందన్నమాట - మందుడు - అంటే శని తోడుంటే వాడు గృహ ప్రగల్భుడు అవుతాడు అట. అంటే ఇంట్లో పులి వీధిలో పిల్లిలాగా డాంబికాలు ఇంటికే పరిమితమన్నమాట. ఈ పద్యం ఎంత క్లిష్టంగా నడిచినా ఎంత బాగా నడిచిందో గమనించండి!

తన శక్తి గురించి - లోకరీతి గురించి - ప్రారబ్దాన్ని గురించి - పూర్వకవుల కవితా వైభవము గురించి పద్యాలు చెపుతూ - ఇటీవల ఇంటింటికీ ప్రాకిన వాస్తు గురించి కవిగారి చెణుకు చూడండి

ఇల్లు జడ మీశ్వరుడగునో?
యెల్ల శుభాశుభ ఫలముల నీయగ వెకలుల్
వల్లింత్రు క్రొత్త శాస్త్రపు
జల్లులు వీరాంజనేయ! సజ్జనగేయా!

రుణానుబంధ రూపేణ పశుపత్నీ సూతాలయా అన్నారు. గృహము స్వతంత్రము కాదు. గృహస్థుని యోగము ప్రకారము రూపు దిద్దుకొనును. గృహము జడము దానికి గృహస్థుని యోగమును మార్చగల శక్తిలేదు అని అవధాని గారే వివరణ ఇచ్చారు.

గ్రహబలం బాగుంటే గృహబలం తగ్గినా ఏమి చేయదనేది జాతకం చెప్పేమాటే!

తన గురించి చెప్పుకుంటూ ఇలా అంటారు సుబ్బన్నగారు. అవధాన విద్య

యనియెడి దివియన్ గొండెక్కనీక తెలుగు
బుడమి యందు వెలుగజేసి తనిసితి రన
వశత వీరాంజనేయ! సజ్జన గేయా!

అన్నట్టు సుబ్బన్నగారు 'అవధాన విద్య' అనే అంశంపై పరిశోధన చేసి 'డాక్టరేట్' పొందారు.

ఈ శతకంలో చాలా పద్యాలు ఆః అనిపిస్తాయి. అహో అనిపిస్తాయి. అద్భుతం అనిపిస్తాయి. ఆహా అనిపిస్తాయి. ఆనందం కలిగిస్తాయి. అవధానిగారు 'ఛాందసుడ' అని చెప్పుకుని ఛాందసుడంటే పద్యకవి అని అర్థం చెప్పారు చివరి పద్యంలో.

అమూల్యం అని ప్రకటించిన ఈ శతకం నిజంగా అమూల్యమే! అవును మరి! సాహితీ సరస్వతికి శతక రచన అమూల్య అపూర్వ అద్భుత అలంకారం కాదా! శ్రీమద్ వీరాంజనేయ శతకం హనుమద్ భక్తులే కాదు. తెలుగు రసికులందరూ చదవదగ్గ రచన.

- యామినీ సరస్వతి

*ఆంధ్రభూమి (జూలై 7 1997 సోమవారం) సౌజన్యంతో*

# వైశ్యప్రబోధిని - క్యాలెండరు

(1997 ఆగస్టు 21 నుండీ 1997 సెప్టెంబరు నెల 20 వరకు)

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| ఆదివారము | | 24 | 31 | 7 | 14 | |
| సోమవారము | | 25 | సెప్టెంబర్1 | 8 | 15 | |
| మంగళవారము | | 26 | 2 | 9 | 16 | |
| బుధవారము | | 27 | 3 | 10 | 17 | |
| గురువారము | 21 | 28 | 4 | 11 | 18 | |
| శుక్రవారము | 22 | 29 | 5 | 12 | 19 | |
| శనివారము | 23 | 30 | 6 | 13 | 20 | |

ఆగష్టు 25 - శ్రీ కృష్ణాష్టమి
ఆగషు 31 - పుబ్బకార్తె రాక ఉ 7-22

అగష్టు 31 :- ఈ క్రింది [illegible] వారు 1997-98 అసెస్‌మెంట్ సంవత్సరము (1996-97) ఆర్థిక సంవత్సరమునకు సంబంధించిన తమ సంవత్సరాదాయపు సంపద పన్నుల లెక్కలను అందుకు సంబంధించిన ఆదాయపు పన్ను శాఖాధికారులకు పంపుటకు ఆఖరు తేది (అ) కార్పొరేట్ అసెసీలు (ఆ)కో-ఆపరేటివ్ సొసైటీలు (ఇ)వర్తకముద్వారానూ, వృత్తి పరంగానూ ఆదాయము వచ్చు అసెసీలు

అగష్టు 31 :- 1997 జూలై నెల జీతముల పై పట్టుకొన్న ఆదాయపు పన్ను వివరాలను తెలుపు 23వ నెంబరు ఫారమును అందుకు సంబంధించిన ఆదాయపు పన్ను అధికారికి చేర్చుటకు చివరి రోజు

అగష్టు 31 :- పదవీ విరమణ చేయు ఉద్యోగులకు 1997 జూలై నెలలో చెల్లించిన జీతము, ఆ జీతములో తగ్గించి పట్టుకొన్న ఆదాయపు పన్నువివరాలను తెలుపు స్టేట్ మెంటు ఫారము నెం. 21 ని అందుకు సంబంధించిన ఆదాయపు పన్ను అధికారికి చేర్చుటకు చివరి తారీఖు

సెప్టెంబరు 5 :- వినాయకచవితి

సెప్టెంబరు 6 :- ఋషిపంచమి

సెప్టెంబరు 13 :- ఉత్తర కార్తెరాక రాత్రి 1-17

సెప్టెంబరు 15:- చెక్కుద్వారా అమ్మకం పన్నును చెల్లించు వర్తకులు ఆచెక్కుతో బాటు A2 రిటర్నును అందుకు సంబంధించిన అమ్మకంపన్ను శాఖాధికారికి చేర్చుటకు ఆఖరు రోజు

సెప్టెంబరు 15:- 1997-98 ఆర్థిక సంవత్సరమునకు సంబంధించి నాన్ - కార్పొరేట్ అసెసీలు తమ అంచనా ఆదాయములో మొదటి కంతునూ, కార్పొరేట్ అసెసీలు తమ అంచనా ఆదాయములో రెండవ కంతునూ, చెల్లించుటకు చివరి తారీఖు

సెప్టెంబరు 16:- సంపూర్ణ చంద్రగ్రహణం స్పర్శకాలము రా 10.38 ని॥లకు శుద్ధ మోక్షకాలము రాత్రి 1-55 ని॥లు
*గమనిక:-* గ్రహణము రాత్రి కాలమున సంభవిస్తున్నందున, నిత్యభోజన, ప్రత్యాబ్ధికాలు యధా ప్రకారము ఆచరించాలి. కుంభ మీనరాశుల వారు ( పూర్వాభాద్ర నక్షత్రకులు) ఈ గ్రహణాన్ని చూడ రాదు. అవకాశం ఉన్న మేరకు శాంతులు జరిపించుకోవాలి.

సెప్టెంబరు 17:- మహాలయ పక్షారంభం

సెప్టెంబరు 20:- A2 రిటర్నును చలానాతో బాటు అందుకు సంబంధించిన అమ్మకంపన్ను శాఖాధికారికి చేర్చుటకు చివరి తేది

---

*- నన్ను మీ టేబులుపై ఉంచుకోండి. ఈ నెల అంతా మీకు కర్తవ్యాన్ని గుర్తు చేస్తుంటాను.*

# వైశ్యులు అనేక నగర రాజ్యాధీశులు

స్వర్గీయ విద్వాన్ అంబటి సుబ్బరాయ గుప్త

గత సంచిక తరువాయి

వాసవకన్యకా కాలమునాటికి రజస్వలానంతర వివాహములు నిషేధింప బడియుండలేదు. వాసవితో కూడ బుట్టిన విరూపాక్షునకు ఉపనయన వివాహములై వాసవి కూడ విష్ణువర్ధనుని నాకర్షింపగల యువతియై యుండినంతవరకు కన్యక గానే యుండెను. గుండప్రవేశ కాలమున గూడ వాసవాంబ మేనరికాది యనేక ధర్మముల గూర్చి ప్రబోధమొనర్చినదేకాని, రజస్వలానంతర వివాహముల గూర్చి యేమియు ప్రసంగింపలేదు. కనుక రజస్వలానంతర వివాహములే ఆనాడు వాడుక యందుండెనని రూఢిగా జెప్ప వచ్చును.

మేనరిక ధర్మముగురించి వాసవాంబ గుండప్రవేశకాలమందు మహోపన్యాస మెందుకు గావించెనో కారణమూహింప సాధ్యముగాకున్నది! ఈ మేనరికధర్మము తప్పని సరిగా పాటింపబడు చుండిన యెడల, వాసవికి మేనరికముండియు నామెతో బుట్టిన విరూపాక్షునకు వివాహమైనంతవరకు గూడ వాసవి కెందుకు వివాహము కాలేదో, మరింత దురూహ్యమైన విషయము. ఇందలి సత్యమేమన్న, నాకాలమందు మేనరిక ధర్మమొక తప్పనిసరిగా ననివార్యమగు ధర్మముగా బాటింపబడుచుండుట లేదనియు, నామేనరికధర్మమును తన విషయమును బాటింప బడక పోవుటచే గాబోలు నామెకు, నామె వలన వైశ్యులకు విష్ణువర్ధనునితోటి వైరము దైవికముగా సంభవించియుండ వచ్చు ననియుదలచి, అటు మీద వైశ్యులు మేనరికధర్మమును తప్పకుండ అనుస రించుట శ్రేయస్కర మనియు, నామె గుండ ప్రవేశ కాలమందు మహాప్రబోధము గావించి యుండ వచ్చుననీ తోచుచున్నది.

మహాభారతాది పురాతన పురాణస్థమైన ధర్మములంబట్టి అంతర్జాతి వివాహములు అనగా పైకులములవారలగు బ్రాహ్మణ క్షత్రియులు వైశ్యకన్యకల వివాహమాడుట ధర్మవిరుద్ధము గాక పోయినను; వాసవకన్యకా కాలమునాటికి ఆ పురాతనా చారము వెనుకబడి, బహుశా నిషేధింప బడియుండుటచే గాబోలు వైశ్య నాయకులు వాసవిని విష్ణువర్ధనుని కిచ్చుట కిష్టపడకుండ యుండిరనవచ్చును. అయినను బ్రాహ్మణులకువలె వైశ్యులకు గూడ ఆనాడు తపోయజ్ఞాదిక వైదికమతాధి కారములు నిషేధింపబడక ఆచార మందుండినవి. వైశ్యులు తపము జేసి కైలాసవాసులగుట, కుసుమశెట్టి పుత్రకామేష్టి యజ్ఞము గావించుట యిందుకుదాహరణగా బేర్కొనవచ్చును. వాసవీసోదరుడగు విరూపాక్షునకు

నుపనయనము గావింపబడినట్లు కన్యకా పురాణమందు గలదు. ఇంతేకాక అవచి తిప్పయ్యశ్రేష్ఠి కంకితముగా శ్రీనాథకవి రచించిన హరవిలాసమందు గూడ తిప్పయ్యశ్రేష్ఠి వంశమునకు మూల పురుషుడుగా బేర్కొనబడిన చిరు తొండనంబి, తన కుమారుడగు సిరియాలునకు ఉపనయనము గావించె నని హరవిలాసమందు జెప్పబడినది. (హరవిలాసము - ద్వితీయాశ్వాసము 102 వ పద్యం) ..... చిఱుతొండసెట్టి యంత...... వడుగు చేయగవలె బిన్నవాని దెమ్ము ॥

## సంఘాచార నిర్ణయసభలు

సంఘమందు వ్యక్తిగతముగాగాని, తదితరముగాగాని, కులాచారముగూర్చి యేదైన విషమావస్థ తటస్థించినపుడు అట్టి సమస్యలగూర్చి చర్చించి, తగిన నిర్ణయము గొనుటకు సంఘమందలి ప్రతినిధి సభలకు వలయు నధికారముండెను. విష్ణువర్ధన రాజునకు తమ కన్యక నిచ్చుటను గురించియు, రాజు కన్యకనిమ్మని బలాత్కరించినపుడును కుసుమశెట్టి తన వైశ్యసంఘంవారినెల్ల సభగూర్చి వారి నిర్ణయమునే పాటింపనీయకొనెను. ఈ సభ లొక్కొక్క గోత్రమున కొక్కొక్క ప్రతినిధిగాజేరి యేర్పడినవిగా నుండి, యిప్పటి ప్రజాప్రతినిధి సభల (పీపుల్సు రిప్రజెంటేటివు అసెంబ్లీలను) బోలి యుండెను. అయినను, అ సభలందు కేవలము అధిక సంఖ్యాకుల (మెజారిటీ) మతమును బట్టియే నిర్ణయములు, నిర్ధారణలు జరుగుచుండలేదు. రాజునకు గన్యకనీయ 612 గోత్రములవార లంగీకరించ కున్నను 102 గోత్రముల వారే వారిని ప్రతిఘటించి నిలువగలిగిరి. ధర్మా ధర్మ యుక్తాయుక్తతలబట్టియు, నీనిర్ధారణలు జరుగుచుండెను. ఈ సభలయందలి సభ్యులు కేవలము శుష్కారాపులు గాకుండ, తాముచేసుకొన్న నిర్ణయముల నాచరణయందుంచుట కెట్టికష్టములకు వెనుదీయని స్వార్థ త్యాగులును, సమర్థులునై యుండిరి. ఒక్క కుసుమ శెట్టియు, నతని కూతురు విషయమై చేకొన్న నిర్ణయమైనను 102 గోత్రములు వారుగూడ కుసుమశెట్టితో గలిసి అగ్నిప్రవేశము జేయవెనుదీయ రైరికారా! ఈ వాసవకన్యకా పురాణగాథా విషయమును పేర్కొని యిటీవల 1962వ సం॥రము జనవరి 3వ తేదీన చెన్నపురి కన్యకాపరమేశ్వరీదేవస్థానమందు శ్రీ కన్యకాపురాణ చిత్రములకు ఆవిష్కర ణోత్సవము గావించుచు, రాష్ట్రపతి శ్రీ సర్వేపల్లి రాధాకృష్ణగారు యీ మన ఆధునిక యుగములో తాను నమ్మిన ధర్మ సంరక్షణార్థం ఆత్మబలిదాన మొనర్చిన ప్రథమసత్యాగ్రహి శ్రీవాసవికన్యకా పరమేశ్వరియే యనియు, నామె తన ఆత్మత్యాగముతో తదితర 102 గోత్రము లగు సంఘీయులను నట్టి యాత్మ త్యాగమున కొడబడ జేయగలిగెననియు తమ యుపన్యాసమున వాకొనిరి. ఇటీవల 1965 సం॥రము నవంబరు 28వ తేదీన హైదరాబాదుకేంద్రంనుంచి ఆకాశవాణి ప్రసారములో జరిగిన "సాహిత్యంద్వారా సంఘసంస్కరణ - గురజాడ" అను

విషయముపైన విశ్వవిద్యాలయ కార్య క్రమంలోని ప్రసంగంలో రాచరికానికి వ్యక్తిత్వానికి సంఘర్షణ, విప్లవప్రబోధం మొదలైన అభ్యుదయ భావాల కాట పట్టుగా శ్రీ అప్పారావుగారి "కన్యకా" రచన విరాజిల్లుచున్నదని వ్యాఖ్యా నించడము జరిగినది.

## వైశ్యయువకులు లేక బాలనాగరుల ప్రాముఖ్యము

ఈ కులపెద్దలు ఇట్లు ఎంతటి గొప్ప కార్యములగూర్చి యెంతేసి నిర్ణయములు తమ సభలయందు చేయగల్గియున్నను, బాలనాగర నామాంతరముగల వైశ్య సంఘమందలి యువకులకు, వారిమాటకు తగిన విలువ నిచ్చెడువారు. వృద్ధనాగరులు సుదీర్ఘాలోచన లేనివారై యేదేని కార్యమున కుపక్రమించునపుడు, అది తమకు వివేకరహితముగాగాని అనుచితముగాగాని తోచినపుడు బాలనాగరులు తమ పెద్దలను ఆయా కార్యములనుండి విరమింపజేయు చుండిరి. రాజు నాహ్వానింపగోరి, వైశ్య వృద్ధులు అతనికి సముచితమైన కానుకలుగా భావించి రత్నాభరణాదులను కొనిపోవ నుత్సహించినపుడు, నివార్య బాలవణిజాః! భవంతో బుద్ధి రహితా! ఇహరాజ్ఞే సమర్పితో.....తద్వైన ప్రతి వర్షంచ బలాద్గృహ్ణంతి భమిపాః । దాతవ్యాని సుపుష్పాణి ఫలాని.............

(వా. క. పు. పం. అ॥ శ్లో॥ 3-9)

ఆ వైశ్యవృద్ధులను వారించి బాల వణిజులు మీరీ విషయమందు బుద్ధి హీనులరై రత్నములు మున్నగువానిని రాజునకు సమర్పించిన, వారు వేశ్యలవలె గ్రహించిన ప్రతి సంవత్సరమట్లే గ్రహించుటకు బలాత్కరింప ప్రయత్నింతురు. రాజులకీయదగినవి, మంచి పుష్పములు ఫలములు మొదలగునవి అట్టి వస్తువులను మాత్రమే రాజునకు కానుకలుగా తీసుకొనిపొండు అని బాలనాగరులు బుద్ధి చెప్పిరి వైశ్యవృద్ధులు అట్టి బాలనాగరుల మాటను సముచితమని పాటించి, రాజునట్టి ఫల పుష్పాదులతోనే చూడబోయిరి. ఆ పిమ్మటగూడ వైశ్యవృద్ధులు తిరిగి బుద్ధిమాలి రాజును తమయింట భోజనమున కాహ్వానించి నపుడుగూడ అందువలన తమకు రాగల ఉపద్రవముల గూర్చి వివరించి చెప్పి వృద్ధ నాగరులను సమ్మతింపజేసి, బాలనాగరులు యుక్తితో రాజును వెనుకకు సాహసించి పంపిరి అగ్నిప్రవేశింప నగ్రతాంబూలము ధన దాహ్వాయుడను యువకుడే చేకొనెను. కాన నప్పటి వైశ్య యువకులు సమయోచిత జ్ఞానము, సాహసము, త్యాగము మొదలగు సముచితోన్నత సద్గుణ సంపన్నులై కుల పెద్దల మెప్పువడసి యీ నాటికిని సంఘ సభలయందు మర్యాదను బొందుట చూడగలము.

అట్టి సమయోచిత జ్ఞానము, సాహసము, త్యాగశక్తికి తోడు సంఘీభావము గలిగి యుండుటచేత,

ఆనాటి వైశ్యులు, భయముచేనేమి నయముచేనేమి, భావగర్భితములగు మధుర వాక్కులచే నేమి రాజును మరలించి, రాజభటుల వేశ్యల వల లందు బడజేసి, అగ్నిని బ్రవేశించి, తాము నమ్మిన కులధర్మ రక్షణజేయ గలిగిరి కుసుమశెట్టి తానొకడే తన పుత్రికతో గూడి యగ్నిని ప్రవేశింప వైశ్య సంఘ సమ్మతికై యర్థించినపుడు సభ్యులందరు నేక కంఠమున, సర్వైరేకత్ర బోక్తవ్యం, శుభంవా, యదివా .. శుభం మానం కులం ప్రతిష్ఠాప్యకీర్తిం కుర్వన్ జగత్రయే॥

(వా. క పు సప్త మోధ్యాయం శ్లో॥6-11)

అనగా మేలో, కీడో, అందరము నొక్కచోటనేయుండి, యనుభవించ వలయు రాజునకు మన కన్యనీయరాదు. కులాచారముల విడువజనదు. మనము ముల్లోకముల మానము కుల ప్రతిష్ఠ నిలిపి కీర్తిని సంపాదింతము అని పల్కిరి. ఈ పల్కులు అప్పటివైశ్యుల సంఘీభావము. స్వార్థత్యాగము. సాహసోదార సద్గుణ సంపత్తిని గూర్చి వేనోళ్ళ చాటుచుండెను గదా! సంఘీభావ నిధానులగుటచేతనే ఆనాటి వైశ్యులు ప్రభువులు, ప్రభు సమానులు, ప్రభు సన్మానితులు గాగలిగిరి. అట్టి ఆనాటి వైశ్యుల సద్గుణ సంపత్తిని నేటి వైశ్య సంఘీయులకు బ్రసాదింప మన వాసవీ జగన్మాతను బ్రార్థించుచు నింతటితో నీ వ్యాసము నిప్పటికి రీతిగా ముగించు చున్నాను.

## మహాసభానాయకుల ద్వంద్వనీతిని ఎండగట్టాలి

ఆర్యా!

జూలై (1997) నెల వైశ్యప్రబోధినిని చూశాను మీరు వేమయ్యగారికి వ్రాసిన లేఖను పై సంచికలో ప్రచురించిన దానిని ఆమూలాగ్రంగా చదివాను కొన్ని వాస్త వాలను బయటికి తెచ్చారు మహాసభకు ఒక పాలసీలేని లోటు కొట్టవచ్చి నట్లున్నది. మీ సాత్విక పోరాటానికి వైశ్యపత్రికలు సపోర్టు చేయవలసి ఉన్నది. 14-6-1997న ముగ్గురు ఎడిటర్లను కలిసి కొన్ని విషయాలు చర్చించాం. శ్రీ ఇల్లూరి శంకరయ్యగుప్త గారి సలహా కొరకు 7-8-97న కడప పట్టణములోని అష్టలక్ష్మీ కళ్యాణ మండపములో రాత్రి 9 గంటలకు సమావేశం ఏర్పాటు చేశాను చాలమంది ఎడిటర్లకు వ్రాశాను ఆ సందర్భములో మనం కొన్ని నిర్దుష్టమైన సమస్యలను చర్చించి, మహాసభ నాయకుల ద్వంద్వనీతిని ఎండగట్టాలి మీరూ తెలివిగా ఈ సమస్యలను గురించి ఆలోచన చేయవలసినదిగా కోరుచున్నాను. పంగులూరి సీతమ్మ ఆస్తి విషయములో మనం ఒక నిర్ణయానికి రావాలి మీరు సమగ్రంగా ఆలోచించి ఒక నిర్ణయానికి రండి. మహాసభలో మనం చొచ్చుకొని పోవుటకు 'గ్రౌండ్సు' వెతకండి ఈతూరి తెలివిగా నన్నుకూడ రాష్ట్ర కౌన్సిల్‌కు రాకుండా నాయకత్వం జాగ్రత్త పడిన విషయం మీకు తెలుసును అను కుంటున్నాను.

బి. వెంకటసుబ్బయ్య
ఎడిటర్, పెన్నార్ ప్రగతి
అనంతపురం.

# వాస్తు వివేకము

సాముద్రిక వాస్తు విదుషీమణి శ్రీమతి బి లక్ష్మీ కాంతమ్మ
ప్రొద్దుటూరు ఫోన్ 52232

వాస్తు రీత్యా గృహం నిర్మించుకొని, కాపురం చేస్తున్న వారందరు సుఖ పడుతున్నారా? అని కొందరు మేధావులు ప్రశ్నిస్తున్నారు పది. పదేను సంవత్స రాలనుండి ప్రజలలో వాస్తుపిచ్చి ముదురుతూ ఉందని కూడ అంటున్నారు ఇటీవల పెరిగిన మాట వాస్తవమే, ఇదిబలుపు కాదు. వాపు. వాపు అరిష్టదాయకమని చెప్ప నక్కఱలేదు.

కీ॥శే॥ శ్రీ ముద్రగెడ రామారావు గారు దాదాపు 45 సంవత్సరాల క్రితం రూపొందించిన వాస్తు గ్రంథం గొప్ప సంచ లనం కలిగించింది. గుప్త పంచాంగం దానికి మంచి ప్రచారం కల్పించింది. తరు వాత తద్విషయాలు దొంగిలించి, సొంత పేరులతో పుస్తకాలు వ్రాయించుకొని మార్కెటులో విక్రయించుకొనువారి సంఖ్య పెరిగింది. తాపీ మేస్త్రీలు -నైరృతి మిట్ట, ఈశాన్యం పల్లం సిద్ధాంతం సర్వత్ర అమలు చేస్తూ వస్తున్నారు. ఇదంత శాస్త్ర బద్ధంగా జరుగుతూ వుందని భ్రమించి, వాస్తు శాస్త్రమనేది వట్టిదని, సుఖదుఃఖాలు కలిగించే శక్తి దానికి లేదని మేధావులు విమర్శిస్తున్నారు. ఇంకను కొందరు ముందుకు వచ్చి ఈ బజారు శాస్త్రంలో ఎంత నిగ్గు వుందో తేల్చాలి.

నేను ఇదివరకే పత్రికా ముఖంగా ప్రకటించాను. భారీగా ఫీజులు స్వీకరించి, ప్లానులిచ్చి, గృహ నిర్మాణం చేయించిన వారు, గృహస్థుని మంచి చెడ్డలకు బాధ్యత వహించాలి గృహప్రవేశం చేసిన తరువాత యజమానికి ఏదైన అనర్థం జరిగితే, ఆరో గ్యం పాడయితే, ఇల్లు విక్రయించ వలసిన దుస్థితి కలిగితే, ఫీజు పుచ్చుకొని, ప్లాను ఇచ్చిన కుహనావాస్తుపండితుని పట్టుకొని నిలదీసి నష్టపరిహారం కోరాలి. అతడు కుంటి సాకులు చెప్పి తప్పించుకొనే ప్రయత్నం చేస్తే, కోర్టుకు లాగాలి ప్రజల్లో ఈ చైతన్యం కలిగితే కృత్రిమవాస్తు పండితులు పలాయనం చిత్తగిస్తారు

నవగ్రహాత్మకమైన బ్రహ్మాండంలో మానవులందరికి ఒకే సూత్రం పట్టి ఒ మాదిరి ఇళ్లు నిర్మిస్తే అందరూ ఒకే రీతిగా వుంటారా? ఎవనికి ఏదిశ యోగిస్తుందో, గుర్తించాలి అంటే జాతక రీత్యా చూడాలి జాతకం లేకుంటే ప్రతివ్యక్తి జాతకం అతని అరచేతిలో వుంటుంది హస్తరేఖలు బ్రహ్మ దేవుడు వ్రాసిన జాతక చక్రం ఈ రేఖలను చదివే శాస్త్రం సాముద్రిక మన్నారు మానవుని జాతకచక్రం హస్తంలో చూచి, అతనికి అనువైన వాస్తును నిర్ణయించాలి. అది శాస్త్రం

నీవు చెప్పేది శాస్త్రమని నమ్మ మంటారా? అని ప్రశ్నించండి. సరియైన సమాధానం లభిస్తే నమ్మండి. లేకుంటే లేదు.

వాస్తు శాస్త్రం అంటే, పూర్వోత్తర దిశలు ఖాళీగా వుండాలని, పల్లంగా వుండాలని,

బరువు వుంచగూడదని, ఈశాన్యద్వారం తప్పనిసరిగా వుండాలని, ఈశాన్యంలో బావిగాని, నీళ్ల కొలాయి గాని, ఏదీ వీలు కాకపోతే నీళ్ళ తొట్టి అయినా వుంచాలని, ప్రతి గదికి ఈశాన్యం ద్వారం అవసరమని చెప్పేది కాదు. ఈ సిద్ధాంతం కీ॥శే॥ ముద్రగెడ వారిది. వారు లోగడ ప్రకటించిన 'రామరాయవాస్తు శాస్త్రం' ఇంత దుమారం లేపింది గొఱ్ఱెదాటుగా చాలా మంది అనుసరిస్తున్నారు.

అద్దెకివ్వడానికి ఇండ్లు కట్టించేవారు కూడ పై సూత్రాలు పాటించి కట్టిస్తున్నారు. అందులో చేరే వారు ఈశాన్యం ఓపెన్, ఈశాన్యం డౌన్ అయితేనే చేరుతున్నారు. వాస్తవం విచారించేవారు లేరు.

ఈశాన్యం విపరీతంగా పెరిగితే విపరీత సంతానం కలిగి, ధనకనకవస్తువులు అదృశ్యమవుతాయి. జ్యేష్ఠుడు కొంప కూలుస్తాడు. పుత్రులు భ్రష్టులవుతారు. ఈశాన్యంలో త్రవ్వించిన బావి పాడు పడుతుంది. నీళ్లు చెడిపోతాయి. లేదా, ఇంకిపోతాయి. ఈశాన్యగృహం కానీ, ద్వారం కాని పల్లంకాని వందలో తొంబయి తొమ్మిది మందికి అచ్చిరాదు. ఒక్కరు తాత్కాలికంగా బాగుపడవచ్చు.

**వాస్తు పద్ధతి:-** గృహ నిర్మాణం చేయదలచిన వ్యక్తి యొక్క స్వరూప స్వభావాలు, యోగ దశావిశేషాలు చూడాలి. తరువాత స్థలపరీక్ష చేయాలి. చెప్పులు వదల్చి, పరిశుద్ధమనస్సుతో స్థలం నలుమూలల నడిచి పరిశీలించాలి. నెమ్మదిగా అడుగువేస్తూ నడుస్తూ వుంటే, భూగర్భంలో శల్య కంకాళములున్నవా? నిధి నిక్షేపములున్నవా? జలవేణికలు - ఊటలు - ఏయే దిశలలో ఎంతెంత ప్రమాణంలో వున్నవి? శిధిలగృహం గోడలున్నవా? ఒకప్పుడు ఊరుగా వుండి, పాడు బడి, దానిపై కాలక్రమేణ మన్ను పేరుకొని చదరపు నేలగా మారినదా? గుర్తించాలి గుర్తింపగలవారే వాస్తు పండితులు.

సింహద్వారం ఏదిశ యోగిస్తుంది? ఆ వ్యక్తికి శత్రుస్థానం ఏదిశ? బావికి అనుకూలదిశ ఏది? వ్యక్తిని బట్టి నిర్ణయించాలి చిత్తూరు జిల్లాలో ఒక యిల్లు పరిశీలించాను ఆ గృహస్థుడు ఇది నాగది అన్నాడు ఆగది ఈశాన్యదిశలో వుంది. నేను వెంటనే చెప్పాను. ఈ గదిలో మీరు శయనించరు. శయనిస్తే నిద్ర పట్టదు. కలతకు గురి అవుతారు. నిజమా? అని ప్రశ్నించాను. అతడు నివ్వెరపోయి, అమ్మా! వాస్తు అంటే ఇదేనమ్మా మీరు చెప్పినదంతా నిజం. ఈగదిలో నేను పండు కొనను. ఎపుడైన బంధువులు వస్తే, స్థలం లేక యీగదిలో పండుకొని, నిద్రపట్టక అవస్థ పడతాను. అన్నాడు.

అనుకూలదిశ పెంచుకొనాలి. ప్రతికూలదిశ త్రుంచుకొనాలి. వ్యక్తిగతంగా పరిశీలించి నిర్ణయించాలి. కళత్రం, సంతానం, వాణిజ్యం, ఉద్యోగం అనుకూలంగా వుండే లాగున వాస్తును మలచుకోవచ్చు. అనుమానించేవారికి, సంశయాత్మకులకు ప్రత్యక్షనిదర్శనంగా ఒక ప్రయోగం చేసి చూపిస్తాను. అదేమిటంటే, ఆవ్యక్తి హస్తరేఖలను బట్టి, యోగప్రదమైన గృహ స్వరూపం నిర్ణయించి చెపుతాను. ఆ రీతిగా తాత్కాలికంగా తడకలతో రెండు మూడు గదులు నిర్మించుకొని ఫలితం చూడమని చెపుతాను. ఒకటి - అక్కడ కూర్చుండి

వ్యాపారం చేస్తే, లాభదాయకంగా, ఉత్సాహజనకంగా వుందా?లేదా? రెండు- ఇంటికి వచ్చి, విశ్రమిస్తే, హాయిగా నెమ్మదిగా, సమ స్యలు లేకుండ వుందా? లేదా?మూడు దుస్స్వప్నాలు రాకుండ, దొంగల బెడద లేకుండా, రేయి హాయిగా నిద్రపడుతుందా? లేదా? చూడండి. నెలరోజులు చూచి, మంచిదనిపిస్తే, తడకలు తీసివేసి, పక్కా యిల్లు కట్టుకోండి. ఇది వాస్తు పరీక్ష.

రత్నపరీక్ష కూడ ఇదేమాదిరి వుంటుంది. అందరికి అన్ని ఱాళ్లు అచ్చి రావు. నవరత్నాలలో అన్నిటికంటె విలువయినది వజ్రం. దాని అధిష్ఠానం శుక్రగ్రహం. శుక్రగ్రహం అనుకూలించి, శుక్రునికి శుభ స్థానములయిన వృషభ తులలకు పాప గ్రహస్పర్శ- అంటే ఉనికి గాని, దృష్టి గాని లేకుండవుండి, సరిగా శుక్రగ్రహ దశ కలిసి వస్తే, అటువంటి వ్యక్తి వజ్రం ధరిస్తే మహారాజయోగం అనుభవిస్తాడు. శుక్రగ్రహం పాపగ్రహమయితే, వజ్రం ధరిస్తే సర్వనాశనమై పోతాడు.

వజ్రానికి, పైకి తెచ్చే శక్తి, క్రిందికి త్రోసే శక్తి వున్నట్లే, గృహదిశలకు వుంది. దిశ అనుకూలిస్తే లక్ష్మీదేవి అవుతుంది. ప్రతికూలిస్తే జ్యేష్ఠాదేవి అవుతుంది. జ్యేష్ఠాదేవి అంటే పెద్దమ్మ

గాలి, వెలుతురు సౌకర్యం లేకుండ ఇల్లు కట్టుకొనుమని యే శాస్త్రమూ చెప్పదు. అన్ని అవసరమే. గాలి కొరకు కొన్ని వంకరలు త్రిప్పితే, సొంపుగానుండునని కొన్ని వంపులు త్రిప్పితే ఆధునిక పద్ధతి అని కొన్ని కోణాలు కత్తిరిస్తే, పాశ్చాత్యుల రీతులు పాటిస్తే, కుటుంబ వ్యవస్థ దెబ్బ తింటుంది. పాశ్చాత్యుల కుటుంబ వ్యవస్థ వేఱు, సంప్రదాయాలు వేఱు, ఆచారాలు వేఱు. కనుక విదేశ వాస్తువు అనుకరించి గృహ నిర్మాణం చేస్తే, మన కుటుంబం కూడ ఇందుకు అందుకు కాకుండ పోతుంది. భారతదేశ వాస్తువు ఇహపరసాధకం, పరమపవిత్రం.

లోకంలో అందరికీ ఒకటే వివాహ లగ్నం పనికి రాదు. ఒక యింట్లో పెండ్లి జరుగుతూవుంటే ప్రక్క యింటిలో మృత్యుదేవత తాండవించి, అందరూ గొల్లున ఏడుస్తూ వుంటారు ఒకయింటిలో ఆనందము, మఱొక యింటిలో ఆక్రోశము ఏక కాలంలో, జరుగుతున్నవి. అంటే, ఆరోజు ఒకరికి శుభప్రదము, మఱొకరికి అశుభప్రదము అన్నమాట.

ఒక యిల్లు నిర్మించి ఒకడు చస్తాడు, లేదా అమ్మివేస్తాడు. వానికి ఆయిల్లు అచ్చి రాలేదు. మఱొకడు అదే యింటిని కొంటాడు. కొని, బాగుపడతాడు. అంటే, వీనికి సరిపడని యిల్లు, వానికి కలిసి వచ్చింది. ఇదే వాస్తురహస్యం. అందరికీ ఒకే నమూనా పనికిరాదు.

## వివాహం

అనంతపురం జిల్లా గుత్తిపుర ప్రముఖులూ, శ్రీ వాసవీకన్యకా పరమేశ్వరీ దేవాలయాలూ, ఆర్య, వైశ్య ధర్మ సంస్థల సమాఖ్య, ఆంధ్ర ప్రదేశ్ కార్యదర్శి & ఇల్లూరుశంకరయగుప్తగారి కుమారులు చి॥ రఘురామేశ్వర్ వివాహం, కడపపుర ప్రముఖులు శ్రీ మునగా రామనాధం గుప్త గారి కుమార్తె చి॥ అనురాధతో 8-8-97వ తేదీన కడప లోని శ్రీ అష్టలక్ష్మి కళ్యాణ మంటపములో వైభవంగా జరుగ పలువురు ప్రముఖులు పాల్గొని వధూవరులను ఆశీర్వదించిరి

# శ్రీశైలక్షేత్ర నగర ఆల్ ఇండియా ఆర్యవైశ్య అన్నసత్ర సంఘం, శ్రీశైలము.
(రిజిష్టర్డు నెం. 25/1960 కర్నూలు)

టెలిగ్రాం అన్ని చోట్లా : "VASAVI", తిరుమలలో "KANYAKAMBA"
టెలిఫోన్ నెం. - మార్కాపురం : 22740, 22004
శ్రీశైలం : 87140, 87114, తిరుపతి : 50030
పుట్టపర్తి : 87240, 87440, తిరుమల : 77682

## వైశ్య యాత్రీకులకు విజ్ఞప్తి

పై సంఘము ద్వారా నాలుగు క్షేత్రములలో సత్రములు కట్టించి అన్ని రకములైన వసతులు ఏర్పాటు చేసి, శాశ్వతముగా, ఉచిత వసతి, నిత్య భోజనములు ఏర్పాటు చేయులాగున తీర్మానించినాము.

### 1. వాసవీ సత్రం, శ్రీశైలం

150 టాయిలెట్ ఫర్నిచర్ కలిగిన రూములు, తయారుచేసి 25.12.62 నుండి నిత్యభోజనములు ఏర్పాటు చేసినాము. ప్రతి సం॥లో 2 లక్షల మంది వైశ్యులు ఉచిత వసతి, భోజన సౌకర్యములు అనుభవించుచున్నారు. ఇందులకై విరాళములు రూ.1251-00లు సమర్పించిన, ఇందుకు వచ్చు వడ్డీ మాత్రం అన్నదానమునకు ఖర్చు చేయబడును. దాత ఫోటో, పేరు వేయబడును. దాత కోరిన రోజు భోజన ఉభయం జరుపబడును. రు.100000-00 సమర్పించిన శాశ్వత అన్నదాతగా ప్రకటించబడును. సం॥లో ఒక నెల దాతకు రూము కేటాయించబడును.

15×9 రూముకు రూ.30000-00 అగును. రూము విరాళంయిచ్చిన దాతకు సం॥లో 30 రోజులు ఇవ్వబడును. దాత ఫోటో, పేరు రూములో వేయబడును.

### 2. వాసవీ నివాస్, పుట్టపర్తి

2 ఎకరముల స్థలములో నిర్మాణం చురుకుగా సాగుచున్నది. 100 రూములు తయారై యాత్రికులకు ఉచితంగా ఇచ్చుచున్నాము. 16.11.95 నుండి నిత్య భోజనములు ఏర్పాటు చేసినాము. వసతి సత్రమునకు గాను రు.1116-00 సమర్పించిన వారి పేరు, ఫోటో కూడా సత్రములో వేయించబడుతుంది. రూ.1,25,000 యిచ్చిన యెడల వారి పేరుతో 30×15 రూమ్ నిర్మించబడుతుంది. దాత ఫోటో, పేరు రూములో వేయబడును. దాతకు 60 రోజులు రూము యివ్వబడును.

అన్నదానమునకు 1 రు 100000-00 సమర్పించిన శాశ్వత అన్నదాతగా ప్రకటించబడును సం॥లో ఒక నెల రూము కేటాయించబడును 2 రు 2501-00 సమర్పించిన సం॥లో ఒక పర్వదినం రోజున అన్నదానం దాత పేరుతో జరుపబడును దాత ఫోటో వేయబడును. 3 రు 1251-00 సమర్పించిన సం॥లో ఒక పర్వదినం కాని రోజున దాత పేరుతో అన్నదానం జరుపబడును

## 3. వాసవీ భవన్, తిరుమల

తిరుమలలో నిర్మించనున్న నాలుగు అంతస్తుల భవనములో రెండు హాల్సు 50×100 అడుగులవి (ఒక సెల్లరు, ఒక గ్రౌండు) సదరు హాల్సు ఎ ఈ క్రింది విధంగా డొనేషన్లు స్వీకరించబడును

హాల్సు డోనార్సు 50×12 అడుగుల ఒక అంకణము హాలుకు లక్ష రూపాయలు విరాళము నొసగు దాతలకు రూము డోనార్లు మాదిరిగా పరిగణించి సంవత్సరములో 30 రోజులు రూము ఇవ్వబడును 14 అంకణములు పరిమితం

రు 2116-00 సమర్పించిన వారి డబ్బు వసతి సత్రమునకు ఉపయోగింప బడును

అన్నదానమునకు రు 100000-00 సమర్పించిన యెడల శాశ్వత అన్నదాతగా ప్రకటించబడును

అన్నదానమునకు రు 10116-00 సమర్పించిన సం॥లో ఒక పర్వ దినం రోజునను, రు 5116-00 సమర్పించిన పర్వదినం కాని రోజున సం॥లో ఒక రోజు జరుపబడును

## 4. వాసవీ నిలయం ఉప్పుటూరు యతిరాజులచెట్టిట్రస్టు, కొత్తవీధి, తిరుపతి.

ఒక భోజనహాలు నిర్మాణంచేసి, వీలైనన్ని అంతస్తులు కట్టిఅధునాతనమైన రూములు తయారుచేసి యాత్రీకుల సౌకర్యార్థం చేయుటకు ప్రయత్నం జరుగుచున్నది అందుకొరకై ఈ క్రింది విధముగా దాతలు విరాళములు సమర్పించకోర్తాము 4 10 95 నుండి నిత్య భోజనములు, వసతులు తాత్కాలికముగా ఏర్పాటు చేసినాము వైశ్య యాత్రీకులు ఉపయోగించుకొన కోర్తాము

### వసతి సత్రమునకు విరాళములు

రు 60000/-లు రూముకు సమర్పించిన దాతలకు సంవత్సరమునకు 30 రోజులు రూము రిజర్వేషన్ చేయబడును పొటో వేసి, నాపరాయిపైన వారి పేరు చెక్కించ బడును.

రు 10000/-లు సమర్పించినవారికి సంవత్సరమునకు 10 రోజులు రూము రిజర్వు చేయబడును పొటో వేసి నాపరాయిపైన పేరు చెక్కించబడును (400 మంది వరకు పరిమితం).

రు 5000/-లు సమర్పించినవారికి సంవత్సరమునకు 5 రోజులు రూము రిజర్వు చేసి వీరి పేరు నాపరాయిపైన చెక్కించి బిగించబడును (400 మంది వరకు పరిమితం)

రు.1116/-లు సమర్పించినవారికి వారి ఫొటో వేసి వారి పేరు నాపరాయిపై చెక్కించబడును.

నిత్య అన్నసత్రమునకు గాను రు.2501/-లు సమర్పించిన యెడల పర్వదినం రోజున అన్న సంతర్పణ, ఉభయం జరుపబడును. వారి ఫొటో వేయబడును. రు 1251/-లు సమర్పించిన పర్వదినం కాని రోజులలో ఉభయం జరుపబడును. రు 100000-00 సమర్పించిన శాశ్వత అన్నదాతగా ప్రకటించబడును వీరికి సం॥లో 30 రోజులు రూము కేటాయించబడును.

## 5. వాసవీ ఆర్యవైశ్య బీద విద్యార్థినిధి

మన సంఘము ద్వారా నిరుపేద వైశ్యుల విద్యాభివృద్ధి నిమిత్తం మూలధనం ఏర్పాటుచేసి అందులకు రాబడు వడ్డీని EAMCETలో పాసైన నిరుపేద వైశ్యుల అప్లికేషన్లు తీసుకొని అందులో విద్యార్హతలు ఎక్కువ గల వారికి సహాయము చేయులాగున తీర్మానించినాము.

ఒక వైశ్యుడు మరొక వైశ్యునకు డైరెక్టుగా సహాయం చేసి బాగుపరచే విధానం శూన్యంగా యున్న ఈ సమయంలో ఒక నిరుపేద విద్యార్థిని చదివించి ఉత్తీర్ణుడిని చేస్తే ఆ బీద విద్యార్థి ఇతరులకు సహాయము చేయకున్నా అతని సంతతికి అనగా కొడుకులు మనుమలు వరుసగా చదివించుకొని బాగుపడుదురుగదా! అలా సహాయము జరుగకున్న ఆ బీద విద్యార్థి చదువు లేక అతని వంశ మంతయు నిరుపేద లౌతారు గదా. కాబట్టి ఈ పద్ధతి పూర్తిగా సాగి నిరుపేదలు చదివితే కొన్ని సంవత్సరములకైనా మన వైశ్యులు విద్యావంతులై గవర్నమెంటులోనో, ప్రవేటు సంస్థల్లోనో, వ్యాపారంలోనో, ఇండస్ట్రీస్ ద్వారానో అభివృద్ధి చెందగలరు. కాన సర్వేశ్వరుడు తమకు కలుగ జేసిన ధనములో ఈ క్రింది విధంగా విరాళముల నొసంగ ప్రార్థన.

ఒక లక్ష రూపాయలు సమర్పించిన వారి ఫొటో శ్రీశైలం, పుట్టపర్తి, తిరుపతి సత్రములలో వేయబడును. వారి పేరు నాపరాయి పైన మూడు సత్రములలో వ్రాయబడును. వీరికి సంవత్సరములో 60 రోజులు ప్రకారం మూడు సత్రములలో రూము కేటాయించబడును.

రు.10116-00 సమర్పించినవారు మహారాజ పోషకులు. వీరి ఫొటో పై మూడు సత్రములలో వేయబడును. వీరి పేరు కూడా మూడు సత్రములలో నాపరాయిపైన చెక్కించబడును.

రు.5116-00 సమర్పించిన రాజపోషకులు. వీరి ఫొటో పై మూడు సత్రములలో రెండు చోట్ల వేయబడును. వీరి పేర్లు అదే రెండు సత్రాలలో నాపరాయిపైన చెక్కబడును.

రు.2116-00 సమర్పించిన వారు పోషకులు. వీరి ఫొటో పై మూడు సత్రములలో ఒక సత్రములో వేయబడును. వీరి పేరు నాపరాయిపైన అదే సత్రములో వ్రాయబడును.

రు.1116-00 సమర్పించిన వారు సభ్యులు. వీరి ఫొటో, వీరి పేరు పై మూడు సత్రములలో ఒక సత్రములో నాపరాయిపైన వ్రాయబడును.

పై ధనమునకు వచ్చిన వడ్డీ EAMCETలో పాసై ఇంజనీరింగ్, మెడికల్ సీటు వచ్చిన నిరుపేద వైశ్య విద్యార్థులలో మెరిట్ కల వారికి పంచబడును.

6. శ్రీ వాసవీ అష్టోత్తర శతహోమగుండ చతుర్థ మహా క్రతువు పై క్రతువు జరుగు 9 రోజులు, 108 హోమ కుండములతో కుండమునకు 4గురు దంపతుల ప్రకారం చేయబడును ఈ సందర్భములో ప్రతి రోజు ఉదయం 6-8 వరకు సామూహిక గీతాపారాయణములు, ప్రతి రోజు ఉదయం 8-12 వరకు క్రతువు జరుప బడును మొదటి రోజు శ్రీమన్నారాయణుని దర్శన క్రతువు, రెండవరోజు రామకృష్ణ క్రతువు, మూడవరోజు అష్టలక్ష్మీ క్రతువు, నాల్గవరోజు శ్రీ లక్ష్మీ వెంకటేశ్వరస్వామి క్రతువు, ఐదవ రోజు పుత్రకామేష్టి క్రతువు, ఆరవరోజు రుద్రక్రతువు, ఏడవ రోజు సప్తశతి, దుర్గా క్రతువు ఎనిమిదవ రోజు శ్రీ లలితాదేవి క్రతువు, తొమ్మిదవరోజు శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ క్రతువు, పూర్ణాహుతి జరుపబడును మధ్యాహ్నం 2 నుండి 7 గంటల వరకు ఆధ్యాత్మిక కార్యక్రమములు, ప్రఖ్యాతి గాంచిన మహాత్ములచే ఉపన్యాసములు, 7-9 వరకు లక్ష దీపాలంకరణలు, యజ్ఞము చేయు వారందరికీ ఉచిత వసతి, ఉపాహార, భోజనములు, యజ్ఞమునకు కావలసిన వస్తువులన్నియు కమిటివారు ఉచితముగా యివ్వగలరు.

## ఇందులకై సమర్పించవలసిన విరాళములు

రు.315-00 సమర్పించినవారు 9 రోజులలో ఒక రోజు ఒక కుండమునకు ఒక ప్రక్క కూర్చొని యజ్ఞము చేయవచ్చును.

2. రు.1116-00 సమర్పించినవారు ఒకరోజు ఒక కుండమునకు ఒక వైపు కూర్చుని యజ్ఞము చేయవచ్చును వీరి పేరుతో 100 మందికి అన్నదానం జరుపబడును యీ సంఘములో వంశ పారంపర సభ్యత్వము కలదు.

3. రు.2500-00 సమర్పించినవారు ప్రతి సంవత్సరము జరుపు యజ్ఞములో ఒక రోజు ఒక కుండమునకు ఒక వైపు కూర్చుని యజ్ఞము చేయవచ్చును. ఈ సంఘములో వంశ పారంపర సభ్యత్వము కలదు.

ఇంకా బియ్యం, పప్పు వగైరా వస్తువులు విరాళములుగా యివ్వవచ్చును

గమనిక : యజ్ఞం టిక్కెట్లు కావలసినవారు ముందుగా DDలు పంపి ఏ రోజు అయినది వ్రాసి పంపి సీటు రిజర్వు చేయించుకొన కోర్తాము.

పంచమ క్రతువు 1999 మార్చి లోపల తిరిగి క్రతువు చేయవలసి యున్నది

ఉత్తర ప్రత్యుత్తరములకు

**మూర్తి వెంకటేశ్వర్లు,**

సెక్రటరీ, వాసవీ సత్ర సముదాయం, శ్రీశైలం, కర్నూలు జిల్లా.

**N.B. :** పై సత్రముల పేరుతో - DDలు కాని, చెక్కులుకాని అయా సత్రములకు పంపకోర్తాము. ఎవరు అడిగిననూ డబ్బు యివ్వవద్దు. అకౌంటు పేయీ చెక్కులు, DDలు యిచ్చేది. కొంతమంది దొంగలు డబ్బు వసూలు చేయుచున్నారు. గ్రహించకోర్తాము.




# Sri Sai Sadan (MEDA'S GUEST HOUSE)

**SBI - Hanuman Temple Main Road, Puttaparthi - 515 134.**
**Anantapur Dist. (A.P.) India.**
**Ph : 08555-87507, 87508 Fax : 08555-87508**

1. Every suit is provided with Pantry, Drawing cum Dining Hall, Bed Room, Sitout and attached toilet.
2. Every suit is equipped with Fridge, Telephone, Geyser.
3. Spacious Bhajan/Meditation Hall on the top floor is provided for devotees.
4. Air-conditioned Suits are also available.
5. A pure vegetarian Restaurant with South Indian, North Indian & Continental dishes.
6. STD, ISTD, FAX Facilities.
7. A Doctor on call.
8. Safety Lockers.
9. Ample parking space.
10. Prompt service and best facilities at affordable Tariff.

**Registered Office :**
**6-3-609/161, Anandnagar Colony, Hyderabad - 500 004.**
**Phones : Off : 3394320, Res : 3313796 (STD : 040) Fax : 394320**

# దక్షిణ ఇండియా ఆర్యవైశ్య శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ ధర్మపరిపాలనా సంస్థ, తిరుమల

- 600 028.

ఫోన్ : 4942074, 4941973

## ▣ విజ్ఞప్తి ▣

అయ్యా,

మా ట్రస్టు బోర్డువారు నూతనముగా విరాళములు వసూలుచేయుటకు క్రింద ఉదహరించిన ప్రకారము తీర్మానించారు

## "వైకుంఠ నివాసం" స్కీము - 1995 రు.10,116/- లు.

500 సభ్యులు మాత్రమే పై సత్రమునందు వీరి జీవిత పర్యంతం సంవత్సరమునకు 3 రోజులు వారికిగాని, వారి అనుమతి పొందిన ఆర్యవైశ్యులకు మాత్రమే రూము ఉచితముగా యివ్వ బడును ఉచితమనగా కనీస మెయిన్‌టెనెన్స్ చార్జి ట్రస్టుబోర్డువారు అట్టి సమయములలో నిర్ణయించిన ప్రకారము వసూలు చేయబడును సంవత్సరమనగా ఏప్రిల్ 1-వ తేది నుండి మార్చి 31-వ తేది వరకు, తిరుమల చేరుటకు 10 రోజులు ముందుగా రిసెప్షనిస్టు, దక్షిణ ఇండియా ఆర్యవైశ్య శ్రీ వాసవీ కన్యకాపరమేశ్వరీ ధర్మపరిపాలనా సంస్థ, రింగ్ రోడ్డు, తిరుమల అనే అడ్రసుకు తెలియపరచవలెను ఒక తేదీన ఒకరికి మాత్రమే వ్రాసి పంపవలెను మరొకరికి వ్రాసి పంపకూడదు ఏ కారణముచేతనైనా ప్రయాణము నిలిపినచో టెలిగ్రామ్ ద్వారా క్యాన్సిల్ అని కనీసం ఒక రోజు ముందు రిసెప్షనిస్టుకు తెలియపరచవలెను అలా తెలియపరచనిచో ఒకరోజు మీ కోటాల్లో తగ్గించ బడును మైనరు దాతలు అంగీకరింపబడరు ఎవరు ముందు పంపెదరో వారిని నిర్ణీత పరిమితి లోపలే తీసుకోబడును తర్వాత పంపినవారికి నిర్ణీత పరిమితి దాటితే వారి డి డి లు వారికి వాపసు పంపబడును పూర్తి మొత్తం ఒకేసారి పంపవలెను

డి డి.లు పై సంస్థ పేరుతో మద్రాసు ఆఫీసు అడ్రసుకు "అక్కౌంటు పేయి"లో పంపవలెను అప్లికేషన్ పూర్తిచేసిన దాత సంతకము తోనే పంపవలెను వారికి బదులు యితరులు చేసిన చెల్లదు విశేష పర్వదినములలో రిజర్వేషను ముందుగా చేయబడదు రిసెప్షనిస్టు అప్పటి పరిస్థితులను బట్టి ఖాళీగా వున్నచో యిచ్చెదరు

ఇట్లు

**ఆర్.ఆర్.నాథం**
మేనేజింగ్ ట్రస్టీ

దక్షిణ ఇండియా ఆర్యవైశ్య శ్రీ వాసవీ కన్యకా
పరమేశ్వరీ ధర్మ పరిపాలనా సంస్థ.

# శ్రీ వాసవీ వీరబ్రహ్మేంద్ర ఆర్యవైశ్య నిత్యాన్నదాన సంఘం

## రిజిష్టర్డు నెం. 328/94

## బ్రహ్మంగారి మఠం - 516 503. కడప జిల్లా.

భారతదేశములోని పవిత్ర పుణ్య క్షేత్రాలలో శ్రీ వీరబ్రహ్మేంద్ర స్వామి మఠమూ ఒకటి. కడప జిల్లాలో ఉన్న ఈ క్షేత్రాన్ని సందర్శించి, స్వామి వారి అనుగ్రహమునకు పాత్రులు కావలెనని భారత దేశములోని నలుమూలల నుండీ భక్తులు ప్రతి రోజూ వేల సంఖ్యలో వస్తున్నారు.

ఈ స్వామి వారిని తిలకించుటకు వచ్చే వైశ్య యాత్రీకులకు భోజన, నివాస వసతులు కల్పించుటకు - 8.2.1993వ తేదీన వసతి భవనములో నిత్యాన్నదాన సత్రమును ప్రారంభించారు 5.11.1995 ఆదివారము ఈ సత్రమునకు శాశ్వత భవనమును నిర్మించుటకు శంఖుస్థాపన జరిగింది.

ఈ అన్నదాన సంఘానికి

రూ.10,116/-లు ఇచ్చిన దాతలు శాశ్వత మహారాజ పోషకులు గానూ,

రూ.5,116/-లు ఇచ్చిన దాతలు శాశ్వత రాజ పోషకులు గానూ,

రూ.2,116/-లు ఇచ్చిన దాతలు పోషకులు గానూ ఉంటారు.

రూ.1,116/-లు ఇచ్చిన దాతల పేర ఒక రోజు ఒక పూట భోజనం

భవన నిర్మాణానికి 50 వేల రూపాయలు ఇచ్చిన దాత పేరున నూతన అన్న సత్రములో ఒక గదిని నిర్మిస్తారు.

రూ.10,516/-లు లేక అంతకు మించి ఇచ్చిన వారు, పై సంఘమునకు శాశ్వత వంశ పారంపర్య సభ్యులుగా ఉందురు. దాత తన హయాములో గానీ, తదనంతరము కానీ తనకు మారుగా దాతచే సూచించబడినవారు ఈ సంఘములో శాశ్వత సభ్యులుగా ఉందురు. సంవత్సరములో 6 రోజులు వీరికి ఉచిత సౌకర్యము కలిగించబడును

రూ.5,116/-లు ఇచ్చిన దాతల పేరున 10 × 19 అడుగుల అటాచ్డ్ బాత్‌రూముతో కూడ రూము నిర్మించబడును. వీరికి సంవత్సరములో 30 రోజులు ఉచిత సౌకర్యము కలిగించబడును.

ఈ సత్రం భవన నిర్మాణానికీ, నిత్యాన్నదాన పథకానికి విరాళాలు ఇవ్వదలచిన దాతలు నేరుగా, పై పేర క్రాస్ చేసిన చెక్కును కానీ, క్రాస్ చేసిన డి.డి.ని కానీ ప్రొద్దుటూరులోని ఏ బ్యాంకులో నైనా చెలామణి అగునట్లుగా, పై అడ్రసుకు పంపి, రశీదు పొందగోరుచున్నాము.

5 వేల రూపాయలకు పైబడి ఇచ్చిన దాతల ఛాయా చిత్రాలను పవిత్ర నామాలతో అన్న సత్ర భవనము నందు ఉంచుతారు.

భవన నిర్మాణ కార్యక్రమం శీఘ్రగతిన సాగుచూ ఉంది. ఈ పవిత్ర కార్యక్రమానికి సహకరించ దలచుకొన్న పవిత్ర హృదయులగు వైశ్య మహనీయులను వెంటనే సహకరించగోరుచున్నాము.

| | |
|---|---|
| **జూటూరు శరభయ్య** | **'ప్రజాబంధు','దానశీల' కామిశెట్టి సుబ్బరావు** |
| కార్యదర్శి | అధ్యక్షులు |

# ఈ నెలలో మీ కర్తవ్యము

(21.8.97 నుండి 20.9.97 వరకు)

మీరు పంపవలసిన A2 రిటర్నును చలానాతో బాటు అందుకు సంబంధించిన అమ్మకంపన్ను శాఖాధికారికి పంపుటకు సెప్టెంబర్ నెల 20వ తేదీయే చివరిది మీరు పంపు ఆ రిటర్నును చెక్కుతో బాటు పంపాలనుకుంటున్నారా? ఆ విధంగా A2 రిటర్నును చెక్కుతో బాటు పంపుటను సెప్టెంబరు నెల 15వ తేదీలోగా చేయాలి

పదవీవిరమణ చేయు ఉద్యోగులకు 1997 జూలై నెలలో చెల్లించిన జీతములూ, ఆ జీతములలో తగ్గించి పట్టుకొన్న ఆదాయపుపన్ను వివరాలనూ తెలుపు స్టేట్‌మెంటు ఫారము నెం 21ని అందుకు సంబంధించిన ఆదాయపు పన్ను అధికారికి ఈ (ఆగష్టు) నెల 31వ తేదీలోగా చేర్చాలి

1997 జూలై నెల జీతములో పట్టుకొన్న ఆదాయపు పన్ను వివరాలను తెలుపు 23వ నెంబరు ఫారాన్ని అందుకు సంబంధించిన ఆదాయపుపన్ను అధికారికి ఈ (ఆగష్టు) నెల 31వ తేదీ లోగా చేర్చాలి

వ్యాపారరీత్యా కానీ, వృత్తి రీత్యా కానీ, ఆదాయము గల అసెసీలు 1-4-1996 తేదీతో ప్రారంభమై 31-3-1997వ తేదీతో ముగిసిన ఆర్థిక సంవత్సరమునకు సంబంధించిన తమ ఆదాయపుపన్ను రిటర్నును ఈ (ఆగష్టు) నెల 31వ తేదీలోగా అందుకు సంబంధించిన ఆదాయపుపన్నుఅధికారికి చేర్చాలి.

మీరు నాన్ - కార్పోరేట్‌కు సంబంధించిన ఆదాయపుపన్ను అసెసీలా? అయితే 1997-98 ఆర్థిక సంవత్సరమునకు సంబంధించిన మీ అంచనా ఆదాయములో (అడ్వాన్సుట్యాక్సు) మొదటి కంతును రానున్న (సెప్టెంబరు) నెల 15వ తేదీలోగా చెల్లించాలి లేక మీరు కార్పొరేట్ అసెసీలే అయితే, 1997-98 ఆర్థిక సంవత్సరమునకు సంబంధించిన అంచనా ఆదాయము (అడ్వాన్సు ట్యాక్సు)లో రెండవ కంతును రానున్న (సెప్టెంబరు) నెల 15వ తేదీలోగా చెల్లించుటను మరచిపోవద్దు.

## రాష్ట్ర వైశ్యసంస్థల సమాఖ్య సమావేశము

హైద్రాబాద్ ప్రధాన కార్యస్థానంగా, ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధులు శ్రీ కె.సి. గుప్తగారి నిర్మాణాత్మక దృక్పధానికి సాక్షిగా రూపుదిద్దుకొన్న రాష్ట్ర వైశ్యసంస్థల సమాఖ్య, ఆంధ్రప్రదేశ్ కార్యవర్గ సమావేశము 30-7-97వ తేదీన అనంతపురం జిల్లా పుట్టపర్తిలోని శ్రీ సాయీ సదన్‌లో జరిగింది. పై సమాఖ్య నూతనాధ్యక్షులు 'పారిశ్రామిక రత్న' శ్రీ గోపా నరసింహులుగారు సమావేశానికి అధ్యక్షత వహించారు. పలువురు ప్రముఖులు పాల్గొన్న ఈ సమావేశము - ఈ సంవత్సరము ఆరుగురికి వారి వారి సేవలనూ, నిపుణత్వాన్నీ బట్టి బిరుదులు ఇవ్వాలనీ - ఈ సంవత్సరము రెండు సమావేశాలు జరపాలనీ, అందులో మొదటి సమావేశాన్ని ప్రముఖ పుణ్యక్షేత్రమైన కర్నూలు జిల్లా పెద్ద అహోబిలంలోనూ, రెండవసమావేశాన్ని మాతృశ్రీవాసవీదేవి మూలస్థానమైన పెనుగొండక్షేత్రములోనూ జరపాలనీ - కార్యవర్గములో ఒక మహిళను ఉపాధ్యక్షురాలుగా నియమించాలని తీర్మానించింది.

